ఓం

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః.

# ఆంధ్ర వాస్తు శాస్త్రము


-: రచియించినది :-

జ్యోతిషరత్న

గట్టు చినవీరరాఘవులు చీరాల.





-: సవరణ చేయబడినది ;-

శ్రీకృష్ణలీలాస్మృతి గ్రంథకర్త

బ్రహ్మశ్రీ బందా ఆదినారాయణశర్మగారు




ఈ గ్రంథ ముద్రణకు ద్రవ్యమిచ్చిన ఉదారహృదయులగు

దాతల పేర్లు వెనుకభాగమున ముద్రింపబడినవి.


1958 మూల్యము రు. 1-8-0



యీ గ్రంథ ముద్రణకు శ్రమపడి చందాలు వసూలు చేసినవారు

ఎడమవైపు నుండి 1. శ్రీ గోలి వోబులు శ్రేష్ఠిగారు:

2. శ్రీ పాలెపు వెంకటరామయ్యగారు

3. శ్రీ పోలాని రాజులుగారు.



శ్రీ ఊటుకూరి రామయ్య శ్రేష్ఠిగారు
వి. ఆర్. యస్. కళాశాల స్థాపకులు
మాజీపురపాలక సంఘాధ్యక్షులు, చీరాల



శ్రీ వై. రంగనాయకులు శ్రేష్ఠిగారు
వీరరాఘవ పేట శ్రీ వీరరాఘవ స్వామివారి
దేవాలయ నిర్మాతలు, చీరాల



శ్రీ రావుల హరిప్రసాదరావు
పంతులుగారు, బి. ఏ. బి యల్.
మాజీపురపాలక సంఘాధ్యక్షులు, చీరాల



శ్రీ॥ శే॥ పట్నాల సన్యాసిలింగం
ఆచార్యులుగారు, చీరాల
శ్రీ కంచి కామాక్షమ్మ దేవాలయనిర్మాతలు
ప్రతిష్ఠాపకులు, ధర్మకర్త.



కీ॥ శే॥ పులకం రామకృష్ణా
రెడ్డిగారు, చీరాల



కీ॥ శే॥ స్వర్ణ రామ కోటా
రెడ్డిగారు, చీరాల



శ్రీ యిందేటి కనకయ్యగారు
చీ రా ల



కీ॥ శే॥ యిందేటి సుబ్బయ్య
గారు, చీరాల



శ్రీ ఘంటా బాపనయ్యగారు:
ల్యాండు లార్డు, బస్ ఓనరు, చీరాల



కీ॥ శే. ఊటుకూరి రామయ్యగారి కుమారుడు
వెంకటేశ్వర్లు శ్రేష్ఠిగారు.



శ్రీ ఊటుకూరి కోటయ్య శ్రేష్ఠి, హృషీకేశ గుప్తగార్లు,
మోహన్ థియేటరు, లెస్సీస్, చీరాల



శ్రీ నరాలశెట్టి శ్రీరాములుగారు,
శ్రీరామా రైస్‌మిల్లు ప్రొప్రయిటరు, స్టూవర్టుపురం.



శ్రీ దాసరి రమాకాంతంగారు
చీరాల పద్మశాలీ సంఘాధ్యక్షులు
హ్యాండులూము క్లాత్ మర్చంటు
చీరాల



కీ. శే. కోడూరి వెంకటేశ్వరరావు
గారు: వేటపాలెం.

శ్రీ గట్టు చినవీరరాఘవులుగారు రచించిన ఆంధ్ర వాస్తు శాస్త్రమును చదివినాను. గ్రంథకర్త చీరాలయందును పరిసర ప్రాంతములందును వాస్తుశాస్త్రమందు సుప్రసిద్ధులని పేరుగాంచి యున్నారు. ఈపట్టణమందలి కళాశాల భవనములకు వీరే ముహూర్త నిర్ణయములు చేసి జయప్రదముగ కట్టడములు పూర్తి అగుటకు మిక్కిలి సహాయము చేసియున్నారు.

గృహనిర్మాణమందు ముఖ్యస్థానము వహించిన ఈ వాస్తు శాస్త్రమును శాస్త్రసమ్మతమైన ఆధారముల ననుసరించి సామాన్య చదువరులకు కూడ సులభముగ అర్థమగునట్లు రచించి శ్రీ గట్టు చినవీరరాఘవులుగారు ఆంధ్రదేశమున కెంతయు ఉపకారమొనర్చిరి. వారి రచనచే ఆంధ్రప్రజల కృతజ్ఞతకెంతయు పాత్రులగుచున్నారు.

(Sd.) T. Rama Rao, M. A. Phd.,
Principal V. R. S. College, Chirala.
28—6—58.

# విషయ సూచిక

## గృహనిర్మాణ భాగము



## గృహప్రవేశ భాగము

## దోషనివారణ భాగము





శ్రీయుత గట్టు చినవీరరాఘవులుగారికి పురజనులు సువర్ణ కంకణ ద్వాయ 'జ్యోతిషరత్న' బిరుదు లిడి సన్మానించు సందర్భమున నొసంగబడిన

# పద్యరత్న పంచకము.

(బ్రహ్మశ్రీ బందా ఆదినారాయణ శర్మ నిర్మితము)

## ఆశీస్సు

తే॥ గీ॥ గట్టు వంశంబు నందునబుట్టి, దిట్ట యగుచు జనసమ్మతుండయి మిగులభక్తి
పెద్దలందునగల గుణ వృద్ధుడైన వీరరాఘవు వారి శుభా న్వితునొనర్చు

## పంచరత్నములు.

ఉ॥ అందుబహూత్త మాన్వయమునందు జనించి వివేకియై సుహృ
ద్బృందము నాదరించుచును ధీనిధియై నిజవృత్తి సేయుచుం
డెందమునందు రాముని గడింది ముదంబున గొల్చుచుం దయా
సుందరుడౌచు దాభువిని శోభిలుచుండును నిత్యతుష్టుడై.

తే॥ గీ॥ అతడు బాల్యంబునుండి జ్యోస్యంబు నందు
మిగుల నభిమానమును గల్గి మేటిభక్తి
గురువు లొద్దను గృషిజేసి గూఢములగు
విషయముల నేర్చి యనుభవ వేదియయ్యె.

మ॥ ఇతడాత్మన్వ్యసన ప్రసక్తిని జ్యోతిష్షీక సామాన్యవ్యా
పృతవృత్తిం గులవృత్తి భాగవత తృప్తిం బత్రికా గోష్ఠిమో
దితుడై జాతక వాస్తు లగ్న ఫలితోక్తిం జాణయై పౌరస
మ్మతుడయ్యెం దగులాభతుష్టిఁ, దగదే మన్నింపవీనింబ్రజల్.

తే॥ గీ॥ అతనివిద్యాప్రవేశ మేమనగవచ్చు
నవన వోన్మేష భావవైభవము గల్గ
విషయముల జర్చజేసెడి వేళలందు
శాస్త్రవేదులు మెడిజొక్కి సంతసింత్రు

తే॥ గీ॥ అతని గుణనయశీల విద్యావివేక
ములకు శ్రేయోభిలాషులౌ పురనిలయులు
"స్వర్ణకంకణ" యుగవిభూషణునొనర్చి
వెలయు "జ్యోతిషరత్న" యన్గ బిరుదునిడిరి.

చీరాల,
14—1—'37. }

ఇట్లు,
శ్రేయోభిలాషులగు. పురజనులు.

# విజ్ఞప్తి

నేను షుమారు ముప్పది సంవత్సరముల క్రిందట జ్యోతిషము నేర్చుకొనవలయునను కుతూహలముతో అప్పటికియీ ప్రాంతమున జ్యోతిష విద్యావేత్తగా పరిగణింప బడుచున్న బ్రహ్మశ్రీ బందా సీతాపతి శర్మగారి కడకేగి నా ఉద్దేశమును దెలుప వారు దయతో ముహూర్త భాగమును బోధించిరి. అనంతరము. శ్రీ జక్కా సుబ్బారాయశాస్త్రి గారియొద్ద సిద్ధాంత, జాతక, వాస్తుభాగములను జదివి జాతకాదిఫలముల దెలుపుచుండ కొంతకాలమునకు నా మిత్రులగు శ్రీ పెండ్యాల మల్లయ్యగారు, శ్రీ గుంటి వెంకటసుబ్బయ్యగారు, శ్రీ పోలాని వెంకటాద్రిగారు, శ్రీ గొన్నాభక్తుల బ్రహ్మమాచార్యులుగారు, శ్రీ గుండపు కోటయ్యగారు, శ్రీ ఆకురాతి వెంకటస్వామిగారు, శ్రీ బొజ్జా వెంకటసుబ్బయ్యగారును, చీరాల పురజనుల తరపున నన్ను సన్మానింపనెంచి ఉదార హృదయులగు దాతలకడ కొంతధనము సేకరించి ది 14-1-1937 న చీరాల పురపాలకాధ్యక్షపదవి నధిరోహించిన వారును వి. ఆర్. యస్. కళాశాలస్థాపకులును శ్రీ మంతులును యగు మ. రా. రా. శ్రీ ఊటుకూరి రామయ్యశ్రేష్ఠిగారి అధ్వర్యమున సన్మాన సమావేశము జరిపి జ్యోతిష రత్నయను బిరుదమును సువర్ణ సింహశీర్ష హస్తకంకణ ద్వయమును నొసంగి యుండిరి. నాకుగల అనుభవముతో అందరకు విశదముగురీతిని తెలుగులో వాస్తుశాస్త్రమును రచింపవలయునను కాంక్షజనించెను. వాస్తుశాస్త్రములు సంస్కృతభాషయందుండి పండితులగువారు తెలిగించినవియు ఆంధ్రభాషయందు పద్యరూపమునను గద్య రూపముగలవియునగు అనేక గ్రంథములున్నవి. ఒకేగ్రంథమునందు పరస్పర విరుద్ధములగు విషయములు గలిగియుండుట వలనను కులవ్యత్యాసముల వలన ఫలితముల సూచించుటచేతను యెంతటి విద్యా విజ్ఞాన సంపన్నుడైనను గ్రహించుటకు కష్టతరముగా నుండుట

వలనను వ్యత్యాస ఫలితములుండుట వలన నమ్మకమును తగ్గినది. గృహస్థులగువారు సుఖమున ననుభవించుటకును. కష్టముననుభవించుటకును. గృహమే మూలాధారమని వాస్తుశాస్త్రానుభవమువలన నాకు గల నమ్మకముచే పరస్పర విరుద్ధములగు విషయములు లేకుండునట్లును. కుల వ్యత్యాసములవలన ఫలితముల మార్పు లేకుండునట్లును. పూర్వశాస్త్ర సమ్మతముగా నుండునట్లును. పద్యలక్షణములను. తెలుసుకొని వ్రాసిన పద్యములను. ఆంధ్రాంగ్ల సంస్కృత భాషా విశారదులును శ్రీ కృష్ణలీలాస్మృతి గ్రంధకర్తలును. అగు బ్రహ్మశ్రీ బందా ఆదినారాయణ శర్మగారు శ్రమకోర్చి సవరింపబడినవాని తాత్పర్య రూపమున శాస్త్రాభిలాషగలవారు సులభముగా నేర్చుకొనుటకు సహాయపడగలదను తలంపుతో యీ గ్రంధమును రచించితిని. యిందు కవిత్వలోపములున్నను. శాస్త్ర లోపములున్నను. గమనింపక స్వల్పముగనైన శాస్త్రాభిలాషులకు ఉపకరించు విషయములున్న గ్రహింపగలరని ప్రార్థన.

గ్రంధకర్త

## అంకితము.

సీ॥ శ్రీ రఘువంశాబ్ధి సోముడై జన్మించి
సీతా మహాసాధ్వి జేకొనియును
పితాజ్ఞ పాలింప విపినంబులకు నేగి
ఖరదూషణాదుల గర్వమడచి
రావణుండాది యారాక్షస బలగంబు
నిర్మూల మొనరించి నింతిదెచ్చి
యాయోధ్యరాజునై యావనీతలంబందు
ధర్మంబునిల్పిన ధర్మమూర్తి

గీ॥ కరుణ నాయందు ప్రసరింప గలుగుకతన
గ్రంధమును వ్రాయగల శక్తిగలిగెగాన

అట్టి రాముని పుణ్యపాదాబ్జములకు
నుతుల గావించి భక్తినంకిత మొనర్తు ॥

తా॥ శ్రీరఘువంశ జనితుడును. సీతనుభార్యగా జేకొనినవాడును. తండ్రియాజ్ఞాను వర్తియై వనవాసమరిగి ఖరుడు దూషణుడు మొదలగు రాక్షస నాశంబొనర్చి భార్యాపహారణుడగు రావణాసురు సుత బంధు సహితముగా నశింపజేసి భార్యను గ్రహించి స్వదేశమరిగి యయోధ్యారాజ్య పట్టాభిషిక్తుడై ధర్మరక్షణ మొనరించిన శ్రీరామ చంద్రుని పాదపద్మములకు, భక్తితో నమస్కరించి యీగ్రంథమును, వారికి అంకిత మొనర్చువాడను.



ఓం

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

# గ్రంధారంభము.

కం॥ శ్రీరఘునందన । రాఘవ ।
నీరజ దళ నేత్ర ! భువన నిపుణోద్ధరణా !
కోరెద నీగ్రంథంబును
సారమతిన్నిర్వహించి జయమును గూర్పన్ ॥ 1

తా॥ ఈ గ్రంధము సాంతముగ నిర్వహింపగల శక్తినొసంగవలసినదిగా శ్రీరఘువంశ చంద్రుడును పద్మపత్రనేత్రుడును జగత్సృష్టికర్తయునగు శ్రీరామచంద్రుని ప్రార్థించువాడను.

విఘ్నేశ్వర ప్రార్థన.

గీ॥ పార్వతీపుత్ర విఘ్నేశ భక్తితోడ ।
ప్రార్థనముజేతు నాదగు ప్రణుతులందు ।
గ్రంధపూర్ణంబు గావింపగ గలుగువరకు ।
విఘ్నములడంపు నీకృపా వీక్షణముల ॥ 2

తా॥ ఈ గ్రంధమును పూర్తిగా వ్రాయువరకు యెట్టివిఘ్నములును. గలుగకుండునట్లు అనుగ్రహింప వలసినదిగా శ్రీ పార్వతీదేవి పుత్రరత్నమగు విఘ్నేశ్వరుని ప్రార్థించువాడను.

భారత భూప్రార్థన.

గీ॥ రామ కృష్ణాది యవతార రత్నములును ।
భక్తవరులగు ప్రహ్లాద పవనసుతులు ।
బుద్ధ రామానుజాది ప్రసిద్ధమతులు ।
జననమొందిన ధాత్రికంజలి ఘటింతు ॥ 3

తా॥ శ్రీరాముడు శ్రీకృష్ణుడు మొదలగు దేవాంశ సంభవులును ప్రహ్లాదుడు ఆంజనేయుడు మొదలగు భక్తాగ్రగణ్యులును బుద్ధుడు రామానుజుడు మొదలగు విజ్ఞాన సంపన్నులును ఉద్భవించిన భారత ధాత్రిమతల్లికి నమస్కారములు.

దేశనాయక ప్రశంస

సీ॥ స్వాతంత్ర్య మనునది జన్మహక్కనినట్టి
మానితుండగు లోకమాన్యతిలకు
శాంతిపథంబున సర్వంబు జయమగు
నంచు బోధించిన యనఘు గాంధి
భక్తి యేదేశపు బారతంత్ర్యము బాపు
కీలకంబను దుగ్గిరాల కృష్ణు
దాతృత్వమున విశ్వదాత పేరుగన్న
కరు.శాసుయుని శ్రీకాశినాథు

గీ॥ వల్లభాయి పటేలును వంద్య చరితు
దేశభక్తుని శ్రీ యాంధ్రకేసరియును
ఆదిగాగలరాజ్య సంపాదకులను
భక్తిసేవింతు నెపుడను రక్తితోడ ॥ 4

తా॥ స్వతంత్రము కోరుట ప్రతిమానవునకును జన్మతోగూడిన హక్కని భారత ప్రజకు బోధించిన శ్రీ లోకమాన్య బాల గంగాధర తిలకుగారిని. శాంతముతో నొనరించు సర్వకార్యములు జయముచేకూర్చుట నిశ్చయమని బోధించి విజయుడైన శ్రీ మోహనదాస్ కరమ్ చందుగాంధిగారిని. భక్తితో భగవధ్యానముజేయుచు రాజకీయ రంగమున పనిచేయుదుమేని స్వాతంత్రసిద్ధిగలుగుట నిశ్చయమని ప్రజలకుబోధించిన శ్రీ ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారిని. తనదు

దాతృత్వము వలన విశ్వదాతయను పేరు బొందిన శ్రీ కళాపరిపూర్ణ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారిని ఎట్టి కష్టములు గలిగినను ధర్మమునందు పట్టుదలతో పనిచేయు వలయునని శ్రీ సర్దారు వల్లభాయి పటేలుగారిని. తనకు గల దేశభక్తివలన దేశభక్తయను బిరుదమును బొందిన శ్రీ కొండా వెంకటప్పయ్య పంతులుగారిని. ధైర్య సాహస నిధియగు శ్రీ ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశము పంతులుగారిని. మొదలగు దేశదాస్యవిముక్తిగావించిన మహనీయుల సేవించు వాడను.

### చీరపురవర్ణన.

శా॥ ధీరత్వంబున విద్యలో వెలయువారే దీప్యమానాంచితుల్
రారామమ్ముల బ్రోవరా యనుచు శ్రీరామున్మదిగొల్చుచున్
శ్రీరాజిల్లగ ధర్మకార్యములతో జెన్నారు పుణ్యాత్ములీ
చీరాలందున వాసమున్నలరు రాజీవాక్షు ప్రేమాన్వితుల్ ॥ 5

తా॥ పరమేశ్వరుని ధ్యానించుటే జీవితపరమావధియని దలంచుచు ధైర్య విద్యాసమన్వితులై ధర్మకార్యములాచరించుచు శ్రీ రామచంద్రుని కృపాకటాక్షమున సర్వసుఖముల ననుభవించు జనులు చీరాల గ్రామమున వసించియుందురు.

### వాస్తువిద్వాంసుల నుతి

గీ॥ అజుడు నింద్రుడు గౌతముడాంగిరసుడు ।
వ్యాసుడు న్విశ్వకర్మయు భార్గవుండు ।
భృగు సనత్కుమారులు మను వెల్ల ఋషుల ।
నాధునిక వాస్తువిదుల కేను దలతును ॥ 6

తా॥ బ్రహ్మదేవుడును, దేవేంద్రుడును, గౌతముడును, ఆంగిరసుడును, వ్యాసుడును, విశ్వకర్మయు, శుక్రుడును, భృగుమహా

ఋషియు, సనత్కుమారుడును, మనువును, మొదలగు సనాతన వాస్తు విద్వాంసులకును ఆధునిక వాస్తు విద్యావిరాజితులగు వారికిని నమస్కరించువాడను.

వంశగురు ప్రార్థన.

గీ॥ వంశగురుడగు అద్దంకి వంశజనితు ।
డైన శ్రీ లక్ష్మినరసింహ సూనుడనగ ।
జ్ఞానభక్తులుగలుగు ప్రజ్ఞాన్వితుండు ।
తాత దేశికాచార్యుల దలతుమదిని ॥ 7

తా॥ మావంశగురువర్యులును భక్తిధ్యాన తత్పరుడును అగు తక్కెళ్లపాటి దక్షిణవంటు సంస్థానాధీశులగు శ్రీమాన్ శ్రీమదద్దంకి తిరుమల సమయోద్దండ కోలాహల లక్ష్మీనృసింహ కుమార తిరువేంకట తాతదేశికాచార్యులయ్యవార్లంగారిని భక్తితో స్మరించువాడను.

వాస్తు జ్యోతిశాస్త్ర గురుస్తుతి.

కం॥ జ్యోతిశ్శాస్త్రారంభము । ప్రీతిమెయిజ్జేసె సకల విద్యాన్వితుడౌ పూతచరిత్రుడు బందా । సీతాపతిశర్మ కేను జేతునమస్సుల్

తా॥ సర్వవిద్యాలంకార భూషణుండగు బ్రహ్మశ్రీ బందా సీతాపతి శర్మగారు జ్యోతిష విద్యారంభ మొనరించి నందులకు వారికి నమస్కరించువాడను.

గీ॥ వాస్తుసిద్ధాంత జ్యోతిష వైద్యశాస్త్ర
విధియటంచని ఖ్యాతిని నెగడుచున్న
జక్కవంశ సుబ్బారాయశాస్త్రి విద్య
గరపె నామహనీయుని కంజలిడుదు ॥ 8

తా॥ వాస్తుసిద్ధాంత జ్యోతిష వైద్యశాస్త్రములయందు అత్యంతానుభవముగల్గి ముహూర్త జాతక సిద్ధాంత వాస్తు ప్రశ్న శాస్త్ర.

ముల బోధించిన శ్రీ జక్కా సుబ్బారాయ శాస్త్రి గారికి నమస్కరించువాడను.

వంశ చరిత్రము.

సీ॥ పద్మశాలియ సంఘుప్రభ జెలంగెడు గట్టు
వంశాన్వయంబున వసుధయందు
మహాలక్ష్మి గోపయ మాన్యుల పౌత్రుండ
చిన వీరస్వామికి సీతమకును
జ్యేష్టపుత్రుండను చినవీరరాఘవు
లను పేర బిలుతురు జనులునన్ను
వాస్తున జ్యోతిషంబందున గలయట్టి
యల్పమౌ జ్ఞానంబు నమర దెల్ప

గీ॥ దలచి యీవాస్తు గ్రంథ బు సులభగతిని
పద్య తాత్పర్య సహితంబువ్రాసినాడ
నిస్సమాన వ్యాకరణ చందస్సులందు
లోపముల నెంచకయె దయజూపవలయు ॥ 9

తా॥ శ్రీ బహూత్తమ పద్మశాలీయ సంఘమునందు గట్టువారి వంశమున గోపయ్య మహాలక్ష్మి యను పుణ్య దంపతులకు పౌత్రుండను. చినవీరాస్వామి సీతమ్మయను వారలజ్యేష్ఠ పుత్రుడను. చినవీరరాఘవులు అను పేరున బిలువబడు వాడను. నాకు జ్యోతిష వాస్తుశాస్త్రములయందుగల అల్ప జ్ఞాన జనితములగు విషయముల నీవాస్తు గ్రంథమున తేలిక యగుపద్ధతిని పద్యములను తాత్పర్యములను వ్రాసి నివేదించుకొనుచుంటిని. గనుక కవిత్వ శాస్త్రములయందు లోపములుండిన మన్నింప గోరువాడను.

# ముహూర్త భాగము.

నామ నక్షత్ర వివరము

సీ॥ ఆరయ చూచెచో-లశ్వినీ ! భరణి కి
లీ లు లే లో లనుకూలములకు
అ ఇ ఉ ఏ కృత్తికాతార కగుజూవె
ఓ వ వీ వు ల రోహిణీ వెలుంగు
మృగశిర వే వో కా కి x నొప్పియుండును
కూశజ్ఞచ్ఛకు నార్ద్రగూడియుండు
కే కో హ హి ల ది తి కేర్పడియుండును
హూ హే హో డకు పుష్యమొప్పుచుండు
డీ డు డే డోల జెల్లు లీవి నాశ్లేషయు
మామిమూమెలకును మఖయెసంగు
మో ట టీ టూర్వభ కొప్పిదమై యుండు
టే టో పా పుబ్బ త్తరపాటి యగును
పూ ష ణా ధ కు హాస్త మురువుజూపుచునుండు
పే పొ రా రికి చిత్తపెనగి యుండు
రూ రె రో తకు స్వాతి బుకుంబు రహియించు
ఖ్యాతి విశాఖకు తీ తు తే తో
నా ని నూ నెల మిత్ర నక్షత్రముండును
నో య యీ యుల జ్యేష్ఠ యొప్పియుండు।
యే యొ బా బికి మూలయేర్పడు బూ ద బా
ఢలకు పూర్వాషాఢ వెలయుచునుమ్మ
విశ్వేశయొప్పారు బే బొ జా జీ లకు
శ్రవణ జూ జే జో ఖు వివరణంబు
గా గి గూ గే లకు గలుగు ధనిష్ఠయు
శతతార దనరు గో సా సి సు లకు

సే సా దా దీ లకు జెల్లు పూర్వాభాద్ర
పరభాద్రదుశ్యచధ రహిమించు
దే దో చా చిలు రేవతీ యుక్త మగుచుండు
నామతార కలిట్టులలరుచుండు 11

తా॥ చూ చె చో ల అశ్వని- లీ లు లే లో భరణి- అ ఇ ఉ ఎ కృత్తిక- ఓ వా వీ వూ రోహిణి- వే వో కా కి మృగశిర- కూ కం ఙ ఛ్ఛ ఆరుద్ర- కే కో హ హి పునర్వసు- హు హే హో డ పుష్యమి- డీ డు డే డో ఆశ్లేష- మా మి మూ మె మఖ- మో టా టీ టు పుబ్బ- టే టో పా పి ఉత్తర- పూ ష ణ ఠ హస్త- పే పో రా రి చిత్త- రూ రె రో త స్వాతి- తీ తూ తే తో విశాఖ- నా ని నూ నె అనూరాధ- నో య యి యు జ్యేష్ఠ- యే యొ బా బి మూల- బూ దా భా ఢ పూర్వాషాఢ- బే బో జా జి ఉత్తరాషాఢ- జూ జె జో ఖ శ్రవణము- గా గి గూ గె ధనిష్ఠ- గొ సా సీ సు శతభిషము- సే సో దా ది పూర్వాభాద్ర- దు శ్యం ఝ థ ఉత్తరాభాద్ర- దే దో చా చి రేవతి- యివి నామ నక్షత్రములు.

కం॥ ఆరుద్రకు కంగచ్ఛయు । ధీరతతో హస్తమణఢ । దెలియగ డభడా । సూరిపూర్వాషాఢయు । దారాపరభాద్రకుండు దగ శంచధయున్॥

తా॥ కం, గ, ఛ్ఛ ఆరుద్రకును- ష, ణ, ఢ హస్తకును- డ, భ, డా పూర్వాషాఢకును- శం, చ, ధ ఉత్తరాభాద్రకును గలిగి యుండును—

గీ॥ ఐత్వమాత్వంబు గూడిన యక్షరముల
కెల్ల స్వరములు విడచియు నెన్నవలయు

పూర్వపక్షరములను తాయును గనంగ
వలయునంచని దెల్పిరి వాస్తువిదులు॥

తా॥ ఐత్వము, ఔత్వముగల అక్షరములయందు ఐత్వ యౌత్వములను విడచి తక్కిన ప్రధానాక్షరములనే గ్రహింపవలయును.

సీ। కృష్ణుని పేరున కెనయుంగ మృగశిర
హృష్ణునకును స్వాతి బుక్కు మొప్పు
శ్రీధరుడను పేర చిత్తయై యుండును
క్షేత్రజ్ఞుడనుటకు జెల్లు హస్త
జ్ఞానుండుననుటకు నారుద్ర యగునండ్రు
భీమునకును మూలప్రీతి నొప్పు
భైరవుండనుటకుబరగు పూర్వాషాఢ
ద్రోణ ద్రుపదులకు దోచు స్వాతి

గీ॥ యల్లయజ్ఞయాచన్నలకెల్ల జ్యేష్ఠ
యెఱ్ఱనకు మూలయనుకూలమెంచి యిట్లు
బలుకుచుందురు పెద్దలు ప్రజ్ఞతోడ
నిట్లుగూఢంబులగు వాని నెరుగవలయు॥

తా॥ కృష్ణుడను పేరునకు మృగశిరా నక్షత్రమును హృష్ణుడను పేరునకు స్వాతినక్షత్రమును. శ్రీధరుడను పేరునకు చిత్తానక్షత్రమును క్షేత్రజ్ఞుడను పేరునకు హస్తా నక్షత్రమును జ్ఞానుడను పేరునకు ఆరుద్రా నక్షత్రమును. భీముడను పేరునకు మూలా నక్షత్రమును. భైరవుడను పేరునకు పూర్వాషాఢనక్షత్రమును. ద్రోణుడు ద్రుపతి యను పేరులకు స్వాతీ నక్షత్రమును. యల్లన, యాచన, యజ్ఞన, యను పేరులకు జ్యేష్ఠ నక్షత్రమును యెఱ్ఱన యను పేరునకు మూలా నక్షత్రమును యగునని పెద్దలగువారు నిర్ణయించియుండిరి.

## గృహ నిర్మాణమునకు ముఖ్యమగు నక్షత్రము.

గీ॥ ఆలయంబును నిర్మింప నాఖ్యతార
శ్రేష్ఠమని దెల్పియుంచిరి శిష్టులెల్ల
నామనక్షత్రమాదిగ నాటితార
నెంచి ఫలితంబు దెలిసియు నెరుగవలయు. 15

తా॥ గృహనిర్మాణము చేయుటకు నామ నక్షత్రమే శ్రేష్ఠము. జన్మ నక్షత్రమును బట్టి తారాబలమును చూచుట ఉత్తమ పద్ధతిగాదు. గనుక నామ నక్షత్రమునే ప్రధానముగా నెంచవలయును.

## రాసుల నక్షత్ర విభాగము.

గీ॥ పదియు రెండగు రాసుల బరగ నిరవ
దేడు తారక లుండుట దెలియువలయు
పదియు రెండిట సమభాగపరత నొప్పి
ఇట్లు రాసులకన్నియు నిమిడియుండు॥

తా॥ నక్షత్రము లిరువదియేడును పండ్రెండు రాసులయందు సమముగా రాశి ఒకటికి రెండుంబాతిక నక్షత్రముల చొప్పున భాగింపబడి యుండును. యెట్లన పాదమనగా నక్షత్రములో నాల్గవ భాగమునకు పేరు. అశ్వని నాలుగు పాదములు భరణి నాలుగు పాదములు. కృత్తిక వక పాదము మేషరాశియును. కృత్తిక మూడు పాదములు రోహిణి నాలుగు పాదములు. మృగశిర రెండు పాదములు. వృషభరాశియు మృగశిర రెండు పాదములు. ఆరుద్ర నాలుగు పాదములు. పునర్వసు మూడుపాదములు. మిధున రాశియు. పునర్వసుఒక పాదము పుష్యమి నాలుగు పాదములు ఆశ్లేష నాలుగు పాదములు కర్కాటక రాశియు. మఖ నాలుగు పాదములు పుబ్బ

# రాసులఅధిపతులు గ్రహములకు ఉచ్ఛనీచలు

సీ॥ సింహంబు సూర్యుని స్వీయగేహంబగు
కటకంబుచంద్రునాగారమగుచు
మేష వృశ్చికములు మేదినీ సుతునిండ్లు
మిధున కన్యలకును బుధుడు విభుడు
చాప మీనములు గీష్పతికి గేహంబులు
వృషతులావిభుడగు భృగుసుతుండు
మకరకుంభములకు మార్తాండసూనుండు
అధిపతులైయుండు రరసిచూడ

గీ॥ రవియు మొదలేడ్గురకు నుచ్ఛరాసులగును
అజము వృషభంబు మకరమునబలకటక
మీన తులలు నీ చెప్పిన వానికెనయ
సప్తమంబులు నీచలై జరుగుచుండు॥ 18

తా॥ సింహమునకు సూర్యుడును కర్కాటకమునకు చంద్రుడును మేష వృశ్చికములకు కుజుడును మిధున కన్యలకు బుధుడును. ధనుర్మీనములకు గురువును. వృషభ తుల లకు శుక్రుడును మకర కుంభములకు శనియు అధిపతులగుదురు. రవికి మేషము ఉచ్ఛరాశియు, తుల నీచ రాశియు అగును. చంద్రునకు వృషభము ఉచ్ఛరాశియు, వృశ్చికము నీచరాశియు అగును. కుజునకు మకరము ఉచ్ఛరాశియు, కర్కాటకము నీచరాశియు అగును. బుధునకు కన్య ఉచ్ఛరాశియు మీనము నీచరాశియు యగును. గురునకు కర్కాటకము ఉచ్ఛరాశియు మకరము నీచరాశియు అగును. శుక్రునకు మీనము ఉచ్ఛరాశియు కన్య నీచరాశియుఅగును. శనికి తులఉచ్ఛరాశియు మేషము నీచరాశియు యగును.

## రాహు కేతువుల ఫలము

గీ॥ రాహు కేతుల కెవ్వరి రాసులగునొ
యెవరివీక్షణ మెవ్వరిగవయుటయును
నగుచునుండునో వారలు నట్టి ఫలము
లిచ్చుచుందురిట్లుగా నెరుగవలయు

తా॥ రాహుకేతువు లెవరి రాసుల యందుండురో యెవరిచేత జూడ బడుచుందురో యెవరితో కలశియుందురో వారలిచ్చు ఫలము నే యిచ్చువారగుదురు. రాహు కేతువులకు స్వస్థానములు లేవు

## గ్రిహముల క్రూర సౌమ్యత్వములు స్థితిఫలములు.

ఉ॥ క్రూరులు భానుడుండరయ కుంభినిసూనుడు రాహుకేతువుల్
సౌరియునంచునుందుదురు ! సాధువులౌదురు చంద్రిశుక్రిలాం
గిరససౌమ్యులున్ !శుభులు కేంద్రిము కోణమునందు నుంటయున్
క్రూరులు మేలు జేయుటయగుందిృషడాయములందు గూడినన్.

తా॥ రవి కుజ రాహు కేతువులు క్రూరగ్రిహములు. మూడు ఆరు పదనోకందు రాసులనున్న శుభఫలము నిత్తురు. చంద్రిడు గురువు బుధుడు శుక్రిడు శుభగ్రిహములు కేంద్రిముల యందును కోణముల యందును నుండిన శుభ ఫలము నిత్తురు. (ఒకటి నాలుగు యేడు పది కేంద్రములు ఐదు తొమ్మిది కోణములు)

## గ్రిహదృష్టి వివరము

కం॥ దుర్వారంబుగ గ్రహములు
సర్వంబును జాచుచుండు సప్తమరాశిన్

గుర్వంగారక శనులకు
వేర్వేరుగదృష్టులవియు వెలయుచునుండున్॥

గీ॥ గురుడు పంచమ నవమంబులరయుచుండు
కుజుడు నాలుగు నెనిమిది కూర్చి జూచు
శనియు మూడును పదియును గనుచునుండు
బలము లీదృష్టులెల్లను ప్రకటితముగ॥

తా॥ అన్ని గ్రహములు సప్తమరాశిని జూచుచుండును. అట్లు సప్తమ రాశిని జూచుచు కుజుడు నాలుగు యెనిమిది రాసులను గురువు ఐదు తొమ్మిది రాసులను శని మూడు పదిరాసులను బలముగల దృష్టితో జూచుచుండును.

## గ్రహ స్థితి ఫలము

గీ॥ సప్తమాష్టమ వ్యయముల సంతతమును
గ్రహము లెవ్వియు లేకున్న గలుగు శుభము
క్రూరులుండుట మాత్రము గూడదెపుడు
లగ్నమున సౌమ్యులుండిన లగ్గొనర్చు॥

తా॥ సప్తమ మందును అష్టమమందును వ్యయమమందును గ్రహములు లేకుండుట మంచిది. సప్తమ మందు శుభగ్రహము లున్న శుభఫలమునే యిత్తురు. అష్టమ మందును వ్యయము మందును శుభగ్రహములున్న మధ్యమ ఫలము నిత్తురు లగ్న మందు శుభగ్రహములుండుట శ్రేష్టము—

గీ॥ లగ్నపతి కేంద్రకోణంబులందు నుంట
మూటలాభంబు లందును పూర్ణబలము
భాస్కరుండును శనియులాభగతులౌట
సర్వదోషాపహరణంబు సౌఖ్యదంబు॥

తా॥ లగ్నాధిపతి కేంద్రములందున్నను కోణములందున్నను మూడిటనున్నను పదునొకండిట నున్నను బలముగల లగ్నమగును రవిగాని చంద్రుడుగాని లాభస్థానమం దుండినయెడల స్వల్ప దోషములతో లగ్నముగూడి యున్నను వానిని హరించి శుభ ఫలమును గలుగ జేయును—

గీ॥ చంద్రుడెనిమిది ! కుజుడేడు ! సౌరియొకట
నాల్గు బుధుడును ॥ రవియైదు ! నారుకవియు
గీష్పతియుమూట ! పదిరెంట కేతువుంట
రాహుతొమ్మిది గల్గగా రాదుశుభము॥ 25

తా॥ ఎనిమిదింట చంద్రుడును ఏడింటకుజుడును లగ్నమందు శని యును. నాల్గింట బుధుడును ఐదింట రవియును ఆరింట శుక్రుడును మూడింట గురువును. పది రెండింట కేతువును తొమ్మిదింట రాహువును చెరుపు చేయువారగుదురు గాన యీ విధముగా ఒక్క గ్రహమున్నను ఆలగ్నము చెడు ఫలమునే గలిగించును—

గీ॥ అష్టమంబున శనియుండి అరయ శుభుల।
దృష్టిగలిగిన నొసగు నభీష్టఫలము।
కౄరదృష్టిని గలిగిన కౄరఫలము।
నిచ్చుగావున నయ్యది నెరుగవలయు॥

తా॥ అష్టమస్థానమున శనియుండి శుభులచేజూడబడుచుండిన అధిక మగు చెరుపు చేయడు. కౄరులచే జూడబడుచుండిన మాత్రము తప్పక చెరుపుచేయును. అష్టమస్థానము ఆయుఃస్థానమగుట వలనను. శని ఆయుష్కారకుడగుట వలనను శుభ గ్రహదృష్టిగల శని అష్టమరాశియందుండుట మంచి దే యగును.

గీ॥ షష్టరిప్పుముల నష్టమస్థానమునను
చంద్రుడుండిన కర్తకుజరుగు కీడు
రెంటమూటను కోణము కేంద్రములను
లాభమందుండ నెప్పుడు శోభనొసగు॥

తా॥ చంద్రుడు కేంద్రములయందును కోణములయందును రెండింట మూడింట పదునొకండింట నుండినమేలు చేయువాడగును. ఆరింట యెనిమిదింట పండ్రెండింటనుండిన కర్తకు చెరుపు చేయువాడగును.

గీ॥ గురువు శుక్రుల స్తంగతు లరయనైన
బాల వృద్ధత్వ దోషముల్బరగనున్న
అర్క చంద్రుల గ్రహణంబులైన వెనుక
గ్రహణ నక్షత్రమును దోషకరములివియు॥

తా॥ గురువు శుక్రుడు అస్తంగతులైయుండినపుడును అనగా మూఢములయందును గురు శుక్రుల స్తంగతులగుటకు అయిదు రోజులుముందును. ఉదయించిన తదనంతరము ఐదు దినములు గడువక పూర్వమును సూర్యచంద్ర గ్రహముల తదనంతరము యేడు రోజులు గతించక పూర్వమును గ్రహణము గలిగిన నక్షత్రమున ఆరుమాసముల వరకును గృహనిర్మాణము చేదగదు.

## కర్తరీదోషము

గీ॥ భరణిమూడిట గ్రహపతి వరలుమొదలు
మొదటి పాదంబు రోహిణి ముగియువనుక
గృహము నిర్మింప నగ్నిచే గీడుగలుగు
దీని కర్తరి యంచును దెలియవలయు.

తా॥ సూర్యుడు భరణి నక్షత్రము మూడవ పాదము మొదలు రోహిణినక్షత్రము మొదటిపాదము ఆఖరువరకు నడచు కాలమునను

కర్తరి యని పేరు యీ కాలమున గృహమును నిర్మించిన యెడల అగ్నిచే దహింపబడును.

## మాసఫలము

సీ॥ శుభము చైత్రంబున విభవంబు వైశాఖ
మరయమృత్యువు జ్యేష్ఠమందుగలుగు
పశుహాని శుచియందు పశువృద్ధి శ్రావణం
బగు ! పుత్రనాశంబు భాద్రపదము
ఆకలిచేబాధ యాశ్వయుజంబున
కార్తికంబును సౌఖ్యకరమునగును
మరియు ధాన్యము వృద్ధి మార్గశీర్షంబున
ననలభీతియు పుష్యమినిఘటిల్లు

గీ। జయము మాఘంబునందున జరుగునంద్రు
ఫాల్గుణంబున సుఖవృద్ధి ప్రబలియుండు
గృహము నిర్మింపదలచెడు గేహపతులు
ఎల్లరిట్టులు ఫలములు నెరుగవలయు.

తా॥ గృహమును చైత్రమాసమున నిర్మించిన శుభమును వైశాఖ మాసమున సంపదయు జ్యేష్ఠమున మృత్యువును ఆషాఢమున పశుహానియు శ్రావణమున పశువృద్ధియు భాద్రపదమున పుత్రనాశమును ఆశ్వయుజమున ఆకలిపీడితమును కార్తీకమున సుఖమును మార్గశిరమున ధాన్యవృద్ధియు పుష్యమున అగ్నిపీడితమును మాఘమున జయమును ఫాల్గుణమున బహు సుఖమును గలుగును.

## వారఫలములు

గీ॥ ఆదిమంగళవారంబు లగ్నిభయము
సోమవారంబు సంతానసుఖమునిచ్చు

శుక్రగురువారములయందు శుభదమగును
శనియు బుధవాసరంబులం దొనరుతిరము.

తా॥ ఆది మంగళవారములయందు గృహనిర్మాణ మొనరించిన అగ్నిభయమును. సోమవారమైన సంతానసుఖమును శుక్ర గురువారములైనయడల శుభమును బుధ శనివారములైన స్థిరత్వమును గలుగ జేయును.

## తిధిఫలము

గీ॥ విదియపంచమి తిధులును తదియమరియు
దశమి సప్తమియును యేకదశియు బహుళ
పాడ్యమీ త్రయోదశుల శుభప్రదములు
గృహము నారంభమును జేయుగేహపతికి.

తా॥ శుద్ధమందును బహుళమందును విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, ఏకాదశి తిధులును, శుద్ధ త్రయోదశి బహుళ పాడ్యమి యీ తిధులు గృహారంభము చేయువారికి శుభమును గలుగజేయును.

## నక్షత్రఫలము

గీ॥ అశ్వనీ చిత్తరోహిణి యరయశ్రవణ
పుష్యమీ హస్త రేవతి ప్రోష్టపదము
అదితి మృగశిర యుత్తరాషాఢస్వాతి
శతభిషోత్తర ధానిష్టజయము గూర్చు.

తా॥ గృహమును నిర్మించుటకు అశ్వని, రోహిణి, మృగశిర, పునర్వసు, పుష్యమి, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, అనూరాధ, ఉత్తరాషాఢ, శ్రవణము, ధనిష్ట శతభిషము, ఉత్తరాభాద్ర రేవతి, యీ పదునారు నక్షత్రములు శ్రేష్టమైనవి.

## గృహారంభ కాలము

గీ॥ మొదటి జామున గేహంబు మొదలు బెట్ట
ఉత్తమంబగు ! రెండింటనుండు మధ్య.
మంబు ! మూడిట యధమమహా ! మరియుకష్ట
మగును నాల్గిటరాత్రిలనగును కీడు.

తా॥ గృహారంభము మొదటిజామున గావించుట ఉత్తమము రెండవ జామున మధ్యమము మూడవ జామున అధమము నాల్గవ జామునందును రాత్రి కాలమందును కష్టములను గలుగ జేయును.

## పంచకరహితము

గీ॥ తారతిథియునులగ్నము వారమదియు
జేర్చితొమ్మిది భాగింప శేషసంఖ్య
మూడుయేడైదుమిగిలిన గూడుశుభము
రెండు ఒకటారు లెనిమిది నుండ చెరుపు॥

తా॥ గృహారంభమును జేయుటకు నిశ్చయించిన నాటి నక్షత్రమును తిథియును లగ్నమును వారమును లెక్కించి ఆ మొత్తము సంఖ్యనుతొమ్మిదిచేత భాగించగా మూడు, ఐదు, ఏడు మిగిలిన శుభమును. ఒకటి, రెండు, నాలుగు, ఆరు, యెనిమిది మిగిలిన అశుభకరమును అగును. నక్షత్రమును అశ్వని మొదలుగను తిథిని శుద్ధ పాడ్యమి మొదలుగను లగ్నమును మేష ము మొదలుగను వారమును ఆదివారము మొదలుగను లెక్కింపవలయును.

## తారాబలము

గీ॥ పేరుమొదలుండు యక్షరతార మొదలు
నాటినక్షత్రమున కెంచి నవమసంఖ్య

భాగహారణంబు జేయంగవచ్చు శేష
మునకు ! నీ క్రింది ఫలములు గనగవలయు॥

తా॥ యజమాని నామనక్షత్రము మొదలు ముహూర్త దిన నక్షత్ర మువరకు లెక్కించి ఆ సంఖ్యను తొమ్మిది చేత భాగించగా శేషమునకు క్రింద తెలిపిన పేర్లును ఫలములును గలుగును॥

గీ॥ ప్రథమమాదిగ మిగులుగా బరగుసంఖ్య
కగును ! జన్మము, సంపద, గ్రొమ్మొగివిపత్తు
క్షేమ, ప్రత్యక్కు-సాధన, చెలగునిధన
మిత్రమును గాక పరమగుమిత్రమగును.

తా॥ ఒకటి మిగిలిన జన్మతార యనియు, రెండు మిగిలిన సంపత్తార యనియు, మూడుమిగిలిన విపత్తారయనియు, నాలుగు మిగిలిన క్షేమతారయనియు. ఐదు మిగిలిన ప్రత్యక్తారయనియు ఆరు మిగిలిన సాధన తారయనియు యేడు మిగిలిన నైధన తారయనియు. యెనిమిది మిగిలిన మిత్రతారయనియు తొమ్మిది మిగిలిన పరమ మిత్రతారయని తెలియవలయును. యీ తారాబల ఫలితము వానిపేరుల ననుసరించియే యుండును. జన్మతార శరీరకష్టమును. సంపత్తార ఐశ్వర్యమును విపత్తార కష్టమును క్షేమతార క్షేమమును ప్రత్యక్తార కార్యభంగమును సాధనతార కార్యానుకూలమును నైధన తారమృత్యువును మిత్రతార శుభఫలమును పరమమిత్రతార అధిక సుఖమును గలిగించును. జన్మతారయందు మూడవ పాదమును విపత్తారయందు మొదటి పాదమును ప్రత్యక్తార యందు నాల్గవ పాదమును. బలమైన చెరుపుగలిగించును. ఆపాదములను వదలి తక్కిన పాదములకు జన్మతారకు శాక మును. విపత్తారకు బెల్లమును. ప్రత్యక్తారకు ఉప్పును దాన మిచ్చి గ్రహింప వచ్చును. నైధనతార యెంతమాత్రము పనికిరాదు.

# రాసుల చరస్థిర ద్విస్వభావ వివరము

సీ॥ వృషభసింహంబులు వృశ్చిక కుంభముల్
స్థిరరాశులగుచును జెలగుచుండు
అరయంగకర్కాట మజతులామకరముల్
చరరాశులౌచును వరలుచుండు
మిథునంబు ధనువును మీనంబు కన్యయు
ద్విస్వభావంబులై దేజరిల్లు
సహజమౌలక్షణ సారూప్యఫలముల
నిచ్చుచుండును ప్రజానీకమునకు

గీ॥ గాన స్థిరరాశులందుల గట్టుగృహము
స్థిరముగానుండు నంచను సరళినెరిగి
వేశ్మ నిర్మాణమొనరింప విజయమంచు
బుధులెరింగించు చుందురు ముదముగూర్ప.

తా॥ వృషభము, సింహము, వృశ్చికము, కుంభము, నను నాలుగు రాసులు స్థిర రాసులు, యీ స్థిరరాసులయందు గట్టు గృహము స్థిరముగా నుండును. మేషము, కర్కాటకము, తుల, మకరము, నను నాలుగురాసులు. చరరాసులు యీనాలుగు రాసులయందు గట్టుగృహమునందు యజమాని స్థిరముగా నుండజాలడు. మిధున, కన్యా, ధనుర్మీనములను నాలుగు రాసులు ద్విస్వభావరాసులు యీ రాసులయందు గట్టు గృహమందు యజమాని కొంతకాలముండుటయు, కొంతకాలము వదలిపెట్టుటయు గలుగును. (చరరాసులయందును ద్విస్వభా రాసులయందును. శుభగ్రహములుండగా గట్టిన గృహమందు యజమాని స్థిరముగానే యుండును.

## నవాంశము

గీ॥ మేషవృషభ కర్కాటక మిధునకోణ
మనెడు నాలుగు కోణంబులందునుండు
నట్టి చరరాసులాదిగ నగునవాంశ
గణనచేయంగ వచ్చును గ్రహములకును॥

తా॥ మేషసింహ ధనుస్సులు మేషకోణమునబడును. యీ మూడురాసులకు నవాంశమును లెక్కించునపుడు మేషము మొదలు కొనియు. వృషభ కన్యామకరములు, వృషభకోణమనబడును. యీ మూడురాసులకు మకరము మొదలు నవాంశమును లెక్కించవలయును. మిథున తులా కుంభములను మూడు రాసులు మిధునకోణ మనబడును. యీ మూడురాసులకు తులా రాశి మొదలు నవాంశమును లెక్కించవలయును. కటక వృశ్చిక మీనములు కటక కోణమనబడును. యీ మూడు రాసులకు కర్కాటకము మొదలు నవాంశమును లెక్కింపవలయును.

## పుష్కర భాగము

సీ॥ కంఠీరవము మేష కార్ముకరాసుల
కిరువదియొక్కటై వరలుచుండు
మకరంబు కన్యయు మరియును వృషభంబు
లకునుండు పదునాల్గు సుకరముగను
తులయును మిధునంబులలరంగ కుంభము
లకు నిర్వదియు నాల్గునికరమగును
కటకంబు వృశ్చిక కమలజములకును
యేడగుసంఖ్యయు యేర్పడంగ

గీ॥ ఇన్ని భాగల కెసగును నెన్న పుష్క
రాంశ ! రాశికి ముప్పదియగును భాగ

లంచు దెలసియు లెక్కించనమరుశుభము
పుష్కరాంశము నుత్తమంబుగను దెలియు॥

తా॥ రాశికి ముప్పది భాగలగును మేషము, సింహము, ధనుస్సనను మూడురాసులయందును. ఇరువదియొకటవ భాగము పుష్కర కాలము. వృషభము, కన్య, మకరము నను మూడురాసుల యందును పదునాల్గవ భాగము పుష్కరకాలము. మిథునము, తుల, కుంభములను మూడురాసులయందును. యిరువది నాల్గవ భాగము పుష్కరకాలము కటకము, వృశ్చికము, మీనముననుమూడురాసుల యందును. యేడవ భాగము పుష్కరకాలము. యీపుష్కరకాలము లగ్నమందు బలమైన కాలము గాన లగ్నమును నిర్ణయించునప్పుడు పుష్కరకాల మునకే నిర్ణయింపవలయును

## లగ్నదోషము

గీ॥ లగ్నమందష్టమపుడొండె! లలినిలగ్న
మాది యష్టమశశియొండె! ద్వాదశంబు
లగ్నమగుటొండె! భవ చంద్రిలగ్నమాది
యష్టమము లగ్నమగుటొండె! యగునుకీడు॥

తా॥ జన్మలగ్నమునకును జన్మకాలచంద్రిలకును అష్టమ లగ్నమందును అష్టమాధిపతి లగ్నమందుండు లగ్నమునందును తన జన్మలగ్నమునకు అష్టమమున చంద్రిడుండులగ్నమునందును జన్మలగ్నమునకు ద్వాదశలగ్నమందును గృహనిర్మాణము చేయుటకూడదు.

## వర్జ్యదోషము

గీ॥ ఆదినుండియు కడవరకరసిచూడ
వర్జ్యముండుట గూడదు! వాస్తువిదులు

దెలిసిజెప్పంగ శుభములు గలుగుగాన
వర్జ్యమున గట్టకష్టముల్వచ్చునిజము.

తా॥ లగ్నారంభమునుండి అంతమువరకును వర్జ్యము లేకుండుట శుభము. వర్జ్యము లగ్నారంభమునకు ముందు ప్రారంభమై కొంతమిగిలియున్నను లగ్నాంత్యకాలమున ప్రవేశించినను ఆ లగ్నము దోషయుక్తమగును. అట్టికాలమున గృహారంభ మొనరించిన యజమానికి చెరుపుగలుగ జేయును.

## పరగ్రామ గమన నిషేధము

కం॥ పరగ్రామంబును జేరగ
సురవైరి గురుండు యెదురు జూడగనునికిన్
నరయన్నీడగు దప్పక
సరసమతిం దెలిసిజనగ సౌఖ్యముగల్గున్.

తా॥ యితర గ్రామ నివాసము బోవునపుడు శుక్రుడు తూర్పుగానున్న యడల తూర్పునకును ఉత్తరమునకును వెళ్లుటకూడదు. శుక్రుడు పడమరగానున్నపుడు పడమర దిక్కునకును దక్షిణ దిక్కునకును వెళ్ళుటపనికిరాదు, మూఢములయందున్న యితర గ్రామములయందు నివసించుటకు వెళ్ళుటకూడదు.

## గృహారంభమునకు కూడని కాలములు

గీ॥ అక్షయ ప్రభవలమధ్య నారు నెలలు
వత్సరాద్యంతములయందు పక్ష మొకటి
ఐదు దివసముల్మాసముఖాంతములను
నగుచుసంధులు! కీడదితగదు తగదు॥

తా॥ అక్షయ ప్రభవ సంవత్సరముల సంధియందు ఆరునెలలును ప్రతి సంవత్సరము ఆఖరు మొదలులయందు పదిహేను దిన

ములును ప్రతిమాసము ఆఖరున నాలుగు రోజులును ప్రారంభమున ఒక రోజును కలిపి మొత్తము అయిదురోజులును సంధికాలములు గాన యీకాలములయందు గృహారంభము కూడదు.

గీ। సగముజామగు యోగనక్షత్రసంధి
కరణ సంధియునగు ఘటికాద్వయంబు
మూడు గడెలు షస్సాయంత్న ములకు సంధి
గలుగులగ్నంబులకు సంధి ఘడియమొకటి

తా॥ యోగముల సంధియందును నక్షత్రముల సంధియందును అర్ధజాముకాలమును. కరణముల సంధియందు రెండుఘడియల కాలమును ఉదయసంధియందును సాయంకాల సంధియందును మూడు ఘడియలకాలమును సంధికాలములనబడును. ఆకాలములయందు గృహనిర్మాణము చేయుట పనికిరాదు,

## గృహారంభమునకు కూడని యోగములు

గీ॥ అరయవిష్కంభ వ్యతిపాతపరిఘశూల
గండ అతిగండవ్యాఘాతముండుటయును
వజ్రమును మరివైధ్రుతుల్బరగనుండ
కర్తకును దుఃఖకరమునై గలుగుకీడు.

తా॥ యోగములు యిరువది యేడింటిలోను విష్కంభము, వ్యతీపాతము, పరిఘము, శూలము, గండము, అతిగండము వ్యాఘాతము, వజ్రము, వైధృతి, అను యీయోగముల యందు గృహము గట్టిన యజమానికి కష్టములు గలుగజేయును.

## గృహము నారంభించుట కయోగ్యములు

చ। జననియు తండ్రియు సుతియు సంతతిభ్రాతలు పోయియుండుటల్
తనదగు వంశజుల్మృతిని దాల్చునశౌచము గల్గియుండుటల్

జననమునందు నంగలుగు జాతము భార్యకు గర్భముండుటల్
జనదు గృహంబుగట్టగను శాస్త్రవిధానము గాఢ్యమెన్నియిన్

తా॥ తండ్రిగతించిన సంవత్సరమందును తల్లిగతించిన ఆరుమాసములలోపలను భార్యగతించిన మూడు మాసములలోపలను కూతుండ్రు కొడుకులు గతించినను సహోదరులు గతించినను నెలాపదిహేను రోజులలోపలను జ్ఞాతులు గతించిన పది రోజుల లోపలను. జ్ఞాతుల గృహమందుగలుగు జననముల వలన సంభవించు జాతాశౌచముగల పదిరోజులలోపలను భార్య గర్భవతియైనది మొదలు మూడుమాసములు గడచిన పిమ్మటను గృహనిర్మాణము చేయుటకూడదు.

కం॥ అరయగ శ్రాద్ధపు దినములు
దరిదాపున యేడ్పువినుట దగవర్షంబున్
నరుగగ యపశకునంబులు
దిరముగ నికటంబుగట్ట దెచ్చును గీడున్ ॥

తా। తద్దినమునకు ముందురోజు తద్దినమురోజు మరురోజు గలసి మూడు రోజులు యందును, గృహారంభముచేయు స్థలమునకు సమీపమందు దుఃఖించుచుండు సమయమందును, వర్షము కురియు సమయమందును శంకుస్థాపనార్థము ప్రయాణమై వెళ్లినప్పుడు అపశకునములు గనుపించినను గృహారంభము పనికిరాదు.

గీ॥ పుత్రికా పుత్రిల వివాహములనుజేసి
పుత్రునుపనయనంబును పూర్తిజేసి
ఒకర్కూటమిలో పిన్ననొప్పువాని
పేరగృహమును నిర్మింపబెంపుగాదు ॥

తా॥ పుత్రుని వివాహముజేసిన సంవత్సరమందును పుత్రుని ఉపనయనము పుత్రికా వివాహముజేసిన ఆరుమాసములయందును ఒకేకుటుంబమునందు పెద్దవారుండగా చిన్నవానిపేరుతో గృహమును నిర్మించుటయు కూడదు.

ముహూర్త భాగము సమాప్తము.

---

## భూనిర్ణయ భాగము.

కం॥ శ్రీకాంతుడైన యాహరి
పాకటముగ ధర్మమిలను బాలనసేయన్ ।
లోకంబునందు బుట్టిన ।
లోకేశ్వరుడైన రాములోనందలతున్ ॥

తా॥ శ్రీమహాలక్ష్మి ప్రియుండగు శ్రీమహావిష్ణువు ధర్మమును పాలించు కొరకు మానవరూపమున అవతరించిన శ్రీరామచంద్రమూర్తిని యెల్లప్పుడు ధ్యానించువాడను.

## అన్య గ్రామ నివాస శుభాశుభములు

గీ॥ కర్తనక్షత్రమాదిగ గ్రామతార
నరసి లెక్కించివానిని నవమసంఖ్య
బాలుగొన్నప్డు శేషమౌ మంచితార
కగుపురము వాసయోగ్యంబటంచు నెరుగు ॥

తా॥ యజమాని నామనక్షత్రము మొదలు గ్రామనక్షత్రము వరకు లెక్కించి ఆసంఖ్యను తొమ్మిదిచేత భాగించగా శేషమగు సంఖ్య రెండు, నాలుగు, ఆరు, యెనిమిది, తొమ్మిదియగు నెడల శుభఫలమును. ఒకటి, మూడు, ఐదు, యేడు మిగిలిన అశుభఫలమును గలుగజేయును.

# గృహము కట్టుటకు పనికిరాని భూములు

సీ॥ గోవుల మందలు గూడెడు చోటును
మలబాధకై పోవగలుగుచోటు
శవముల బూడ్చిన నవనీతలంబును
ఉప్పుగా నుండెడు నుర్వియందు
చెరువులు బావులు చెడిపూడు చోటును
గుడినీడ బారెడు కుంభినియును
వీధికి నెదురుగా వెలసెడు చోటును
మూడుమూలలుగల భూతలంబు

గీ॥ శంకరుని కెదురుగానుండు క్ష్మాతలంబు
హరికి పృష్టంబు శక్తికి నరయపార్శ్వ
ముననుగలచోట గృహములనొనరగట్ట
వంశహానియు కష్టముల్వచ్చు నిజము

తా॥ ఈశ్వరుని దేవాలయమునకు ముందు 200 గజములలోపల నుండు చోటును. విష్ణు దేవాలయమునకు వెనుక 40 గజముల లోపలనుండుచోటును. శక్తిదేవాలయమునకు యిరు ప్రక్కల కనుచూపుదూరము లోపలనుండు చోటును. గోవులమందలు నిలచుచోటను ప్రజలు మలమూత్రి విసర్జన చేయు చోటును. స్మశాన భూమియును. ఉప్పుగానుండు నేలయును. చెరువులు బావులు చెడినపిమ్మట పూడ్చిన చోటును. దేవాలయమునీడ ఉదయము తొమ్మిది గంటలు మొదలు మధ్యాహ్నము మూడుగంటలలోపల పడుచోటును మూడు మూలలుగల చోటును గృహనిర్మాణము చేయుటకు తగవు. అట్టిభూములయందు గృహమును నిర్మింతురేని కష్టములు గలుగుటయేగాక వంశహానియగును.

సీ॥ పుట్టలు గలనేల బూడిదనేలయు
దుర్గంధయుతమయి తోచునేల
చవిటినేలయు బిలసామీప్య భూతలి
పగులుట సాజమైపరగునేల
అరయ గుండ్రని నేల మురజాకృతి తలంబు
మధ్యోన్నతంబగు మహితలంబు
బండియాకారంబు దండాకృతి తలంబు
కర్ణాకృతిగలట్టి క్ష్మాతలంబు

గీ॥ తల్లిదండ్రికినన్నకు దక్షిణంబు
పడమరనుయుండు నదియును పారునదికి
యెదురు నేలల వాసంబు యెపుడు దగదు
వాసమున్నచో కష్టముల్వచ్చునిజము ॥

తా॥ తల్లికి దండ్రికి అన్నకు దక్షిణము పడమర దిక్కులయందుగల చోటుయందును. ప్రవాహామునకు యెదురుగా యుండు స్థలమునందును. పుట్టలుండు నేలయందును బూడిద వర్ణము గల నేలయందును బిలమునకు సమీపమందుండు నేలయందును. పగులునట్టి స్వభావముగల నేలయందును. గుండ్రని అకారముగల నేలయందును మధ్యభాగము యెత్తుగాయుండి చుట్టను పల్లముగాయుండు నేలయందును బండిఆకారముగల నేలయందును కఱ్ఱవలె అతిపొడవుగలిగి వెడల్పు తక్కువగా నుండు నేలయందును. చెవి ఆకారముగల నేలయందును గృహ నిర్మాణము చేసినయెడల ధననష్టము సంతాన నష్టము గలుగునుగాన అటువంటి స్థలములయందు గృహనిర్మాణము పనికిరాదు.

# గృహ నిర్మాణమునకు ఉత్తమ భూములు

సీ॥ ఉత్తర దిశకన్న వున్నతంబునుదీర్ఘ
మైయుండు దక్షిణ మరయగలది
తూర్పుదిక్కునకన్న దొడ్డగు పొడవెత్తు
నగుచుండి పడమర నైనయదియు
శ్వేత వర్ణంబును పీతవర్ణంబును
సస్యంబులును బండజాలునదియు
నాలుగు దిక్కుల నరయగా సమమునై
పుష్ప సుగంధంబు బొరయునదియు

గీ॥ తూర్పు పడమర పొడవయి దోచునదియు
నగు ప్రదేశంబు లిండ్లకు నమరెనేని
సర్వసంపదలును పుత్రసౌఖ్య మబ్బి
యశముగల్గుట నిజమని యరయవలయు ॥

తా॥ ఉత్తర దిక్కుకన్న యెత్తును పొడవును దక్షిణ దిక్కునగలది యును తూర్పుదిక్కుకన్న యెత్తును పొడవును పడమర దిక్కు నగలదియును అనగా ఉత్తరము తూర్పు పల్లమును కురుచ యుగలదియును. దక్షిణము పడమర యెత్తుగానుండి పొడవుగానుండు నదియును. తెల్లని వర్ణమైనను పసుపు పచ్చని వర్ణమైనను గలుగునదియును పైరులుపండు స్వభావము గలుగునదియును. నాలుగు దిక్కుల సమానముగా నుండునది యును సువాసనతో గూడినదియును తూర్పు పడమర పొడవుగను ఉత్తరము దక్షిణము కురుచగను యుండు స్థలము గృహము కట్టుటకు శ్రేష్టము. అట్టి స్థలములయందు వాస ముగలవారు ధనధాన్యసమృద్ధిగల వారుగను కీర్తిప్రతిష్టలు గలవారుగను యుందురు.

## భూమియొక్క శుభాశుభములు

సీ॥ నిమ్నమీశానమౌనేల సౌఖ్యదమగు
తూర్పుపల్లంబైన దోచు వృద్ధి
ఆగ్నేయమున పల్లమైనచో సుఖనష్టి
దక్షిణ నిమ్నమాయుక్షయంబు
నైరుతి పల్లమైనను గృహనాశంబు
పశ్చిమంబైన నపాయకరము
వాయువ్య నిమ్నంబు పటుకోపవర్ధనం
బుత్తర హీనంబు విత్తదంబు

గీ॥ పల్లముగ మధ్యమందున్న పనికిరాదు
గానశుభ ఫలదాయకకరమునైన
భూమి వసియింప పతికిని భూరివృద్ధి
నిచ్చునని దెల్పుపెద్దల నేర్పువినుము

తా॥ ఈశాన్యమునందు పల్లమగు నేల సుఖమును. తూర్పు పల్లమగు నేల వంశవృద్ధియును, ఆగ్నేయమున పల్లమగు నేల సుఖనాశమును, దక్షిణమున పల్లమగు నేల మృత్యుభయమును, నైఋతి పల్లమగు నేల గృహనాశమును. పడమర పల్లమగునేల చెడు ఫలితములను వాయువ్యమున పల్లమగు నేల కోపవృద్ధియును. ఉత్తరమున పల్లమగు నేల ధనవృద్ధియును మధ్యను పల్లముండు నేల అనేక విధములగు కష్టములును. గలిగించును. గనుక గృహనిర్మాణమునకు పూర్వమే భూమిని శుభమగునట్లుమిట్ట పల్లములు గలుగునట్లేర్పరచి నిర్మాణమును చేయవలెను.

సీ॥ పాదమాదిగ కర్ణపర్యంతమును గొల్చి
దానిచే నలుదిశల్దనరగొల్వ
వచ్చునం కెసిమిది బాల్గొన శేషంబ
చోకటాది యెనిమిదిమందునిట్లు

రజకంబు ! చర్మకారము ! భూసురంబును
శూద్రంబు ! యోగిని ! సాదిగోప
కము ! క్షత్రియంబు చక్రస్థానమగు పేర్ల
బరగుచు ! రజకాదిఫలములరయ
గీ॥ శుభము ! క్షుత్పిపాసయును : రుశోనంబు
ధనపు ! ధాన్యంపు ! వృద్ధి యౌదాసినమును
సర్వసిద్ధియు ! కలహము ! సర్వమరణ
మనెడు ఫలముల ! నిచ్చునయ్య వనితలులు.

తా॥ గృహయజమాని పాదము మొదలు చెవివరకు కొలిచి ఆకొలచినదానిచే భూమియొక్క నలుదిశలును గొలువగా వచ్చిన సంఖ్యను యెనిమిదిచేత భాగింపగా ఒకటి మిగిలిన ఆభూమికి రజక స్థానమనిపేరు శుభమును గలుగజేయును రెండుమిగిలిన చర్మకారమనిపేరు దుర్భిక్షమును గలిగించును. మూడు మిగిలిన బ్రాహ్మణమనిపేరు. శోభనమును గలిగించును. నాలుగు మిగిలిన శూద్రమనిపేరు. ధనలాభమును గలుగజేయును. అయిదు మిగిలిన యోగిని అనిపేరు ఔదాసినముగలిగించును ఆరుమిగిలిన గోపకమనిపేరు సర్వసిద్ధిని గలిగించును. యేడు మిగిలిన క్షత్రియమని పేరు కలహమును గలిగించును. యెనిమిది మిగిలిన చక్రస్థానమనిపేరు. మరణము గలిగించును. యీ విధముగా భూమియొక్క శుభాశుభములు. గలిగియుండును.

## కలిపికట్ట రానిభూములు

గీ॥ పరగ తూర్పునతలముతో పశ్చిమంపు
ఉత్తరంబున తలముతో నొనరదక్షి
ణాపుభూమిని జేర్చియు వాలయంబు
గట్ట భార్యకు పుత్రులకగును కీడు॥

తా॥ తూర్పున భూమిగలిగి తదనంతరము పడమర కలుపుకొని ఆరెండు స్థలములను చేర్చి ఒక యిల్లు కట్టుటగాని, ఉత్తరము నందు భూమియుండి దక్షిణమునగల భూమికలుపుకొని ఆ రెండు భూములను చేర్చి నొకయిల్లు కట్టుటగాని పనికిరాదు అట్లు దక్షిణము పడమర కలుపుకొని కట్టునెడల ఆయింటి యజమాని భార్యకును పుత్రులకును చెరుపుగలుగును, దక్షిణము పడమర తీసుకొనబడిన స్థలములో ప్రత్యేకముగా గృహమును నిర్మింపవచ్చును.

## దిగ్వర్గములు.

సీ॥ ప్రాగాది దిక్కులంబరగును అకచట
తపయశలంచన దవరువర్గ
ప్రాగాది దిశలను బరగెనువర్గలు
గరుడ మార్జాలముల్ హరియు శునక
కాకోల మూషక గజ శశంబులు వర్గ
కధిపతులైయుంట నరయవలయు
అధిపతి వర్గాన కరయు ప్రచమువర్గ
మరివర్గమయ్యును వరలుచుండు

గీ॥ గాన శత్రు మిత్రంబుల గణన నెరిగి
స్వీకరించుట భూమి నిశ్శేషకరము
వర్గ వివరంబునకు దప్పు వర్తనంబు
కర్తకెమ్మెయి నాపత్కరంబుసూవె॥

తా॥ అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, యీ అక్షరములు అవర్గము
క, ఖ, గ, ఘ, ఙ, యీ అక్షరములు కవర్గము
చ, ఛ, జ, ఝ, ఞ, యీ అక్షరములు చవర్గము
ట, ఠ, డ, ఢ, ణ, యీ అక్షరములు టవర్గము
త, థ, ద, ధ, న, యీ అక్షరములు తవర్గము

ప, ఫ, బ, భ, మ, యీ అక్షరములు పవర్గము
య, ర, ల, వ, యీ అక్షరములు యవర్గము
శ, ష, స, హ, యీ అక్షరములు శవర్గము

యీయెనిమిది వర్గములు వరుసగా తూర్పుమొదలు యీశాన్యము వరకుగల యెనిమిది దిక్కులయందును గలిగియుండును. అవర్గమునకు గరుత్మాతుడును. కవర్గమునకు పిల్లియు. చవర్గమువకు సింహామును టవర్గమునకు కుక్కయును. తవర్గమునకు సర్పమును, పవర్గమునకు యెలుకయును, యవర్గమునకు యేనుగును, శవర్గమునకు కుందేలును అధిపతులగుదురు. యజమాని పేరునకు మొదటగల అక్షరము యేవర్గమునందుండునో ఆవర్గమునకు అయిదవ వర్గము శత్రువర్గము అగును. ఆశత్రువర్గముగల దిక్కునందు భూమినికొనుటగాని యితరుల వలన గ్రిహించుటగాని పనికిరాదు. వర్గాధిపతుల ననుసరించి శత్రుమిత్రస్వభావమును దెలిసి భూమిని స్వీకరింపవలయును శత్రువర్గముగల దిక్కునందు భూమిని గ్రిహించిన యజమానికి తప్పక చెరుపు గలుగును.

గీ॥ నామ వర్గసంఖ్యకు ప్రక్క భూమివర్గ।
సంఖ్య జేర్పగ। నేర్పడు జంటసంఖ్య।
నెనిమిదింటను బాల్గొన। నిలిచియుండు।
శేషసంఖ్యమె। ధనమయి జెలగుచుండు॥

తా॥ తనపేరు మొదటి అక్షరమేవర్గము నందుండునో ఆవర్గము ఆవర్గము మొదలు యెన్నవ వర్గమగునో ఆసంఖ్యనువ్రాసి మనము గ్రిహించుటకు నిశ్చయించిన స్థలము యేదిక్కు నందుండునో ఆ దిక్కు తూర్పు మొదలు యెన్నవ దిక్కుఅగునో ఆ సంఖ్యను మొదటవ్రాసిన సంఖ్యకు ప్రక్కనువ్రాశి ఆ మొత్తము సంఖ్యను యెనిమిదిచేత భాగింపగావచ్చు శేషము ధనము

గును. యెట్లనగా పరంధామయ్యా అనువారు ఉత్తరము దిక్కున భూమి కొనదలచిన యడల పరంధామయ్యా పేరునకు మొదట, "ప" ఉండుట వలన ప వర్గమయ్యెను. ఆ వర్గము మొదలు ప వర్గము ఆరవ వర్గముగనుక ఆరుసంఖ్యను వ్రాసి స్థలముగల ఉత్తర దిక్కు తూర్పు మొదలు యేడవ దిక్కు గనుక ముందువ్రాసియున్న ఆరునకు ప్రక్కనచేర్చగా అరువదియేడు అగును. అరువదియేడును యెనిమిదిచేత భాగించగా శేషము మూడుమిగులును గనుక ధనసంఖ్య మూడు అగును.

గీ॥ భూమి సంఖ్యకు ప్రక్కన నామసంఖ్య।
నునిచి। యెనిమిదిచేత బాగ్గొనగ శేష।
మగును। ఋణసంఖ్య గావున మరియు ధనము:
గలుగు దిక్కున గృహమును గట్టవలయు॥

తా॥ భూమి యేదిక్కుగలదియో ఆదిక్కు తూర్పు మొదలు యెన్నవ సంఖ్య అగునో ఆసంఖ్యను వ్రాసి తనపేరుగల దిక్కు యొక్క వర్గసంఖ్యను ముందువ్రాసియున్న సంఖ్య ప్రక్కవ్రాసి ఆ మొత్తము సంఖ్యను యెనిమిదిచేత భాగించగా శేషము ఋణమగును. యెట్లనగా పరంధామయ్యా కొనదలచిన భూమి ఉత్తరము గనుక తూర్పు మొదలు ఉత్తరదిక్కు సంఖ్యయగు యేడును వ్రాసి దానిప్రక్కన పరంధామయ్యా పేరుగల వర్గసంఖ్యయగు ఆరును. మొదట వ్రాసియున్న యేడు సంఖ్య ప్రక్కను వ్రాయగా డెబ్బదియారు యయ్యెను. ఆ డెబ్బదియారును యెనిమిదిచేత భాగించగా శేషము నాలుగు వచ్చును. ఆ శేషసంఖ్య ఋణమగును. గనుక పరంధామయ్యకు ఉత్తరము దిక్కు స్థలముకొనుటకు ధనసంఖ్యకన్న ఋణసంఖ్య హెచ్చువచ్చెను గనుక పనికిరాదు. యిట్లుస్థల

ముకొనదలచిన వారు ముందున్న గృహమునకు గాని స్థలము
నకుగాని వర్గబలమును తెలుసుకొన వలయును. అంతకుపూ
ర్వము యిల్లుగాని స్థలముగాని లేనియెడల వర్గవిచారమక్కర
లేదు.

## గృహ నిర్మాణము చేయరాని స్థలములు.

గీ॥ మూడుమూలలకంటెను చూడహీన ।
మగుచు । నుండెడు యాగ్నేయ మరయ నైరు ।
తులను । గల భూమి వాసంబు వలను పడదు ।
కష్టములు గల్గి ఋణపీడగలుగు నిజము ॥

తా॥ తూర్పు, దక్షిణము, పడమర, ఉత్తరము వీనిని దిక్కులని
యు యీశాన్యము ఆగ్నేయము నైరుతి వాయువ్యము వీనిని
మూలలనియు వాడుచుందురు. ఆగ్నేయము నైరుతి యీ
రెండు మూలలయందును తరుగుగల స్థలమునందు నివాసము
పనికిరాదు. అట్టి స్థలమునందు గృహమును నిర్మించి నివసిం
తురేని కష్టములనుభవించుటయేగాక ఋణపీడితులగుదురు.

## శల్య విచారము.

ఉ॥ నేలను శల్యముల్గలవ యేర్పడ ప్రశ్నను దెల్పుమంచనన్ ।
కాలముజూచి । దత్సమయ కాలపులగ్నమునందు సౌమ్యులున్ ।
దాలిమి జేరియున్నయెడ । దప్పక శల్యములుండు । క్రూరులా !
కాలపు లగ్నమందు । గలుగంగను వస్తులు లేకయుండెదున్ ।

తా॥ మేము యిల్లుగట్టదలచిన భూమియందు శల్యములు మొదలగు
దోషములేమైన గలవాయని ప్రశ్న నడిగిన యెడల ఆకాల
మందు నడచుచున్న లగ్నమునందు శుభగ్రహములు గూడి
యున్నయెడల శల్యములాభూమియందు తప్పక యుండును. ఆ
కాలమందుగల లగ్నమున క్రూరగ్రహములున్నయెడల శల్య

ములు మొదలగు దోషములేమియు లేవని తెలియవలయును

గీ॥ గలసి సౌమ్యులు । క్రూరులుగల్గుటయును ।
జూడ క్రూరులు ! శుభులచే జూడబడుట ।
శుభులు నిల్వగా । క్రూరులు జూచుచుంట ।
లోతు భూమిని । శల్యంబు లుంటనిజము ॥

తా॥ ప్రశ్నకాల లగ్నమున క్రూరగ్రహములు శుభగ్రహములు గలసియున్నను క్రూరగ్రహములుండి శుభగ్రహములచే జూడబడుచున్నను శుభ గ్రహములు లగ్నమందుండి క్రూరగ్రహములచే జూడబడుచున్నను. లోతుగల భూమియందు శల్యములుండును మనిషి ప్రమాణమునకు మించినలోతున దోష భూయిష్టమగు శల్యాదులున్నను చెరుపుగలిగించనేరవు

గీ॥ లగ్ననాథుండు । యేయంశలగ్నమందు ।
నుండు । నాలగ్న నాథుండు నుండుదిక్కు
నెన్ని యంశలనడచునో యెరిగిచోటు ।
నిర్ణయింపగ వలయును నేర్పుతోడ ॥

తా॥ శల్యములున్నవని నిర్ణయింప బడినప్పుడు ఆప్రశ్నలగ్నాధి పతి యేనవాంశమందుండునో ఆనవాంశరాశ్యాధి పతియగు గ్రహము యేదిక్కుగల రాశియందుండునో ఆదిక్కునందు శల్యములున్నవనియు ఆనవాంశరాశ్యాధిపతితానున్నరాశి యందు యెన్నవ నవాంశగతుడైయుండునో ఆదిక్కునందు అన్నవ భాగమున శల్యములుండును. దిక్కుల విషయమై మేష, సింహ, ధనుస్సులు తూర్పుదిక్కనియు వృషభ, కన్యా, మకరములు దక్షిణ దిక్కనియు మిధున, తులా, కుంభ ములు పడమర దిక్కనియు. కటక, వృశ్చిక, మీనములు ఉత్తర దిక్కనియు తెలియవలయును.

సీ॥ ప్రశ్నకాలమునకు బాదముల్వీడను।
మదినెంచి। యిరువదెన్మిదియు జేర్చి
పదిరెంట గుణియించి పదునారభాగింప
శల్య భావంబుల సరణి దెలియు
శేష మొక్కటియైన శీర్షంబు నెముకయు
రెండైన। శల్యములిటుకమూడు
నాలుగు పెంకులు నైదైన కొయ్యలు
నారైన। విగ్రహమరయనుండు

గీ॥ ఏడు మొదలుగ పదునారు నెరుగువరుస
భూతి। దుష్కణ పాంగార భూరిధాన్య
పీత। పాషాణమండూక। వృషభవివిధ
శునక। పైశాచ శల్యముల్వూడ గలరు॥

తా॥ ప్రశ్నకాల సమయమునకుగల పాదముల నీడను. లెక్కించి ఆ సంఖ్యయందు యిరువదెనిమిదిచేర్చి మొత్తము సంఖ్యను పదిరెంట హెచ్చించి పదహారుచేత భాగించగా మిగిలిన శేషము ఒకటియైన తలఎముకయు రెండైన ఎముకలును మూడైన యిటుకలును నాలుగైన పెంకులును అయిదైన కొయ్యలును ఆరైన విగ్రహమును యేడైన బూడిదెయు. యెనిమిదైన శవమును తొమ్మిదైన బొగ్గులును పదియయిన ధాన్యమును పదునొకండు శేషమైన బంగారమును. పండ్రెండైన రాళ్లును. పదమూడైన కప్పలును. పదునాలుగైన గోవు యెముకలును. పదునైదైన కుక్కశల్యములును. పదునారైన పిశాచ శల్యములును గలిగియుండును. శేషము సున్న యగునపుడు పదునారని తెలియ వలయును.

గీ॥ ఆవు నెమ్ములు। ధాన్యములరయకప్ప
పసిడియును। గానుపించిన భద్రకరము

తక్కినవి యెల్ల కష్టముల్దప్పకుండ
గలుగ జేయును । నిలుగట్టవలను పడదు

తా॥ భూమిని త్రివ్వగా కనుపించిన వానిలో ఆవుమెముకలుగాని ధాన్యముగాని కప్పలుగాని బంగారముగాని యైనయెడల శుభ ఫలమును తక్కినవన్నియు కష్టమును కలిగించును గనుక చెరుపుకలిగించునవి కనుపడినప్పుడు అక్కడగల మంటితోసహా తీసివైచి గృహమును నిర్మింపవలయును.

భూనిర్ణయభాగము సమాప్తము.

## గృహనిర్మాణభాగము

కం॥ శ్రీకర గుణసంపన్నుడు ।
ప్రాకట భూజాతపతియు పరమపురుషుడున్ ।
లోకోద్భవాది విధులకు ।
దాకారకుడైన । రాముదలతున్మదిలో॥

తా॥ సృష్టిస్థితిలయకారుడును శుభకరుడును సీతానాథుడును యగు శ్రీరామచంద్రుని మదిలో ప్రార్థించువాడను.

## మూలలందు యిండ్లుగట్టుటవలన ఫలము

ఉ॥ నైరుతిదిక్కునందునను నగ్నిక కుప్పను వాయుదిక్కునుం।
నారయ నీశుదిక్కునను యాలయసృష్టి యదెంతమాత్రిమున్।
గోరియు చేయగాదగదు గూడును కష్టము లెల్లవేళలన్ ।
ధీరచరిత్రి! గేహములు దెచ్చునుకీడును మూలలుండినన్॥

తా॥ స్థలమునకు మూలలయందు అనగా అగ్నేయదిక్కునందునను నైరుతి దిక్కునందునను వాయువ్యదిక్కునందునను యీశాన్య దిక్కునందునను గృహనిర్మాణము చేయగూడదు. అట్లుచేసిన

యడల కష్టఫలములుగలుగును. గృహములయందును మూల భాగమున నివాసముండిన చెరుపుగలుగును.

## గృహ నిర్మాణ విధములు

కం॥ అరయుగ పంచమువిధముల ।
బరగును! గృహగతులు నవియు వర్తులమగుటన్।
మరియేక, ద్వితి, చాతుర ।
సరళులనొప్పారియుండి సౌఖ్యముగూర్చున్॥

తా॥ భూమియందు గృహములను అయిదు విధములుగా నిర్మాణము జేయుచుందురు. ఒకటి గుండ్రనిఆకారము గలిగియుండు చుట్లిల్లు రెండుయేకశాల మూడుద్విశాల నాలుగుత్రిశాల అయిదు చతుశ్శాల యగుచుండును.

## ఆయములు ఫలములు

సీ॥ ఆయంబులెనిమిది యగుచుండునెట్లన ।
ధ్వజము, ధూమము, హరిభవ్యశునక।
వృషభంబు, ఖరమునువినుము మత్తేభంబు।
కాకంబులను పేర్లగలుగుచుండు।
పూర్వాది దిశలందుబొల్చును క్రమముగా ।
ధ్వజమాది కాకముల్బతులునగుచు।
ధ్వజము కృతార్థంబు దగధూమమును మృత్యు।
మృగరాజు జయఫలంబొగి నొసంగు।
గీ॥ రోగమిచ్చునుశునకంబు! భోగిగోవు ।
ఖరముశోకము! శుభమగు గజమువలన।
నిష్ఫలంబుగ కాకంబు నిజమువినుము।
ఆయములకగు ఫలములిట్లమరియుండు॥

తా॥ ఆయములు యెనిమిదివిధములుగా నుండును మొదటిది ధ్వజా యము తూర్పుదిక్కుగలది సంకల్పసిద్ధిని గలిగించును. రెండ

వది ధూమాయము ఆగ్నేయదిక్కుగలిగి మృత్యుభయమును కలిగించును. మూడవది సింహాయము. దక్షిణదిక్కుగలది జయమునుకలిగించును. నాల్గవది శునకాయము. నైరుతిదిక్కుగలది రోగమును గలిగించును. ఐదవది వృషభాయము. పడమరదిక్కుగలది భోగమునుగలిగించును. ఆరవది ఖరాయము వాయువ్యదిక్కుగలది దుఃఖమును గలిగించును. యేడవది గజాయము. ఉత్తరదిక్కుగలది శుభమునుగలిగించును. యెనిమిదవది కాకాయము. యీశాన్యదిక్కుగలది ఫలశూన్యమగునది. యిట్లు అష్టవిధ ఆయములును, ఫలములును గలిగియుండును.

గీ॥ ధ్వజము మొదలుగ కాకంబువరకు నింద్రు ।
డగ్ని, యముడును, నిరృతి, యరయవరుణ ।
వాయు, ధనపతు, లీశుండు బతులునగుచు ।
వరదులగుదురు! వారలీవరుసదోప॥

తా॥ ధ్వజాయమునకు యింద్రుడును ధూమాయమునకు అగ్నియును సింహాయమునకు యముడును, శునకాయమునకు నిరృతియు, వృషభాయమునకు వరుణుడును, ఖరాయమునకు వాయుదేవుడును, గజాయమునకు కుబేరుడును, కాకాయమునకు శివుడును అధిపతులై ముందు తెలుపు ఫలముల నిచ్చువారలగుదురు.

గీ॥ ఇంద్రుడాదిగ దిక్పతులిచ్చు ఫలము ।
మొనసి సౌభాగ్య, గృహదాహములును, నశుభ।
శత్రుభీతులు! పశులాభ చలనములును।
ధాన్య శుభములు! వరుసతో దనరుచుండు॥

తా॥ ఇంద్రుడు సౌభాగ్యమును, అగ్ని గృహదహనమును, యముడు చెరుపును, నైరుతి శత్రుపీడితమును, వరుణుడు పశులాభ

మును, వాయువు స్థానచలనమును, కుబేరుడు ధాన్యవృద్ధియు, శివుడు శుభఫలమును గలుగజేయును.

## ఆయములు క్రమముతప్పుటవలన ఫలము

గీ॥ ధ్వజముహరియును! ధేనువుగజముల నెడు ।
నాలుగాయంబు లెటనున్న నమరు శుభము ।
కాక శునకంబు ధూమంబు ఖరముల నెడు ।
ఆయసంచయ మెటనున్న యశుభకరము॥

తా॥ ధ్వజాయము, సింహాయము, వృషభాయము, గజాయము అను నాలుగాయములు. వానికి చెప్పబడిన దిక్కులయందు అధిక బలము గలిగియుండి తక్కిన దిక్కులయందును శుభమునే గలిగించును. ధూమాయము, శునకాయము, ఖరాయము, కాకాయము యను నాలుగాయములు వానికి చెప్పబడిన దిక్కులయందు స్వల్పముగను యితరదిక్కులయందు ప్రబల ముగను కష్టములను కలిగించును.

## అయమునకు వర్గగణితము

సీ॥ నిడుపు వెడల్పు గుణింపంగ పదమగు ।
పదమునీ చెప్పగా బడెడు సంఖ్య ।
లందాడి! సంఖ్యతో నరయ హెచ్చించియు ।
నింపుగా పరము భాగింప వర్గ ।
లెనిమిది, పదిరెండు, నెనయమూడెనిమిది ।
నవసప్తమంచును, నారుముప్ప ।
దియు! నెన్మిదియు! నిర్వదేమను! నవయష్ట ।
నవశతవింశతి యారుత్రొమ్మి ।

గీ॥ దిట్లు గుణియింప ధనమును దెలియ ఋణము ।
వారమును దిననక్షత్రముమర నాయ ।

వాయువంశము॥ నని యెడు వర్గములును ।
ఆయురష్టమాంశంబు దానధిపు దెలుపు॥

తా॥ పొడవును వెడల్పుచే గుణింపగావచ్చు చదరపు గజములకు క్షేత్రీకృతపదమని పేరు. ఆపదమును సంఖ్యను యెనిమిదిచేత హెచ్చించి పండ్రెండుచేత భాగించగావచ్చు శేషము ధన సంఖ్యయగును. పదమును మూడుచేతహెంచి యెనిమిదిచేత భాగించగావచ్చు శేషము ఋణమగును. పదమును తొమ్మిది చేతబెంచి యేడుచేత భాగించగా శేషము వారమగును. పద సంఖ్యను ఆరుచేత హెచ్చించి ముప్పదిచేత భాగించగా వచ్చు శేషము తిథియగును. పదమును యెనిమిదిచేత హెచ్చించి యిరువదియేడుచేత భాగించగావచ్చు శేషము నక్షత్రమగును. పదమును తొమ్మిదిచేత హెచ్చించి యెనిమిదిచేత భాగించగా శేషము ఆయమగును. పదమును తొమ్మిదిచేత హెచ్చించి నూటయిరువదిచేత భాగించగా శేషము ఆయుర్దాయమగును. పదమును ఆరుచేత హెచ్చించి తొమ్మిదిచేత భాగించగా శేషము అంశమగును. ఆయుర్దాయసంఖ్యను యెనిమిదిచేత భాగించగా వచ్చు శేషము దిక్పతియగును.

## నవ వర్గ ఫలములు

సీ॥ అధికధనంబయి యాలరంగ ఋణహీన ।
మును! గల్గి శుభము దానొనరజేయు ।
ఆయము ల్బేసివియగుచున్న శుభమగు ।
సమసంఖ్యగలవైన జరుగుహాని ।
ఆరంభతిథ్యుడు నహములుఫలదంబు ।
లాదియందెట్లలై యాయమునకు ।
ఆయువు! నరువదికధికంబు శుభమగు ।
తగ్గిన కష్టముల్ దాపురించు ।

గీ॥ అంశలంగున! మొదటిది యరయునాల్గు ।
అయిదు! నారును కష్టంబులమరజేయు ।
రెండుమూడేడు యెనిమిదియుండెగాక ।
తొమ్మిదియునిచ్చు విజయంబు నమ్మవలయు ॥

తా॥ గణితముచేయగావచ్చు సంఖ్యలలో ధనసంఖ్య అధికముగా నుండి ఋణసంఖ్య తక్కువగానున్న ధనలాభమును, ఋణ సంఖ్య అధికముగానుండి ధనసంఖ్య తక్కువగానున్న ఋణ పీడితమును గలుగును. గణితముచేయగావచ్చు తిధి, వార, నక్షత్రములలో గృహారంభమునకు చెప్పబడిన శుభ తిధి వార నక్షత్రములు శుభఫలమగును. తక్కినవి అశుభఫలమును గలుగజేయును. గణితముచేయగావచ్చు నక్షత్రము తననామ నక్షత్రమునకు రెండు, నాలుగు, ఆరు, యెనిమిది, తొమ్మిదిగా నుండిన శుభఫలమును ఒకటి, మూడు, అయిదు, యేడుగా నున్న అశుభఫలమును గలుగజేయును. గణితముచేయగా యేర్పడు ఆయుర్ధాయసంఖ్య అరువదికి మించియున్న శుభఫల మును, ఆరువదికి తక్కువగానున్న అశుభఫలమును గలుగ జేయును. గణితముచేయుగావచ్చు అంశలలో రెండు, మూడు, యేడు, యెనిమిది, తొమ్మిది యీఅయిదు అంశలు శుభఫల మును, ఒకటి, నాలుగు, అయిదు, ఆరు యీనాలుగు అంశలు కష్టఫలమును గలుగజేయును. దిక్పతులు ముందు తెలి పియున్న ఫలములను గలుగజేయుదురు.

## ఆయనిర్ణయము

గీ॥ గర్భమున కాయమనునది గలిగియుండు ।
గర్భమున రెండుగమలుగా గనగవలయు ।
నాల్గుగజములుగానున్న గల్గుశుభము ।
మించియుండిన దారిద్రిమిచ్చునండ్రు ॥

తా॥ ఆయము గర్భగృహమునకు మాత్రమే కలిగియుండును. పంచలు ఆయమునందు చేరవు. గర్భమనగా రెండుగడలు వెడల్పు అని నిర్ణయించుకొనవలయును. గర్భము వెడల్పు నాలుగు గజములుండిన శుభఫలమును, అధికముగానున్న దరిద్రమును కలిగించును.

కం॥ ఆయంబు గోడనడుమకు ।
యేయింటికినైనగాని యెనయకయుండన్ ।
ఆయంబులెక్కదప్పును ।
సాయంబుగ! కూచములును జననిల్పినయన్ ।

తా॥ ఆయనిర్ణయము గోడలకు మధ్యకుగా నుండవలయును గోడల మధ్య కూచములున్నను లేకయున్నను గోడలమధ్యకే నిర్ణయింపవలయును. అట్లుగాక గోడలలోపలికని నిర్ణయింపబడు నెడల గోడలమందము స్థిరమగునదిగాదు గనుక ఆయనిర్ణయమునకు భంగము గలుగును.

గీ॥ పంచమాత్రము కాపురవాసములకు ।
మూడుదిక్కులనుండిన ముదముగూర్చు ।
నాల్గిటనుగల్గ దోసంబుగల్గువినుము ।
పంచగర్భము మధ్యకునుంచ చెరుపు ॥

తా॥ ఇండ్లకు పంచ మూడుదిక్కులయందుండిన శుభమును నాలుగు దిక్కులందుండిన అశుభమును గలుగజేయును. దేవాలయము, మఠము, సత్రము వీనికి నాలుగు దిక్కులనుండు పంచలు చెరుపు చేయవు. గర్భము మధ్యభాగము వరకు మాత్రమే పంచవేసిన చెరుపుచేయును.

గీ॥ తనదువంశమువారును తనదుగోత్ర ।
మున్నవారును! ప్రక్కనున్నయెడల ।

వారికూచంబులకు దప్ప వంశహాని।
పంచకూచంబులకు పారు నెంచవలదు ॥

తా॥ తనగోత్రమువారుగాని తనవంశమువారుగాని ప్రక్కనున్నను యెదుటనున్నను వారిపారును తప్పించి యిల్లును కట్టకూడదు. అట్లు తప్పించికట్టినయడల వంశహానికలుగును. యీనిర్ణయము గర్భము గలుగునంతవరకే వర్తించును పంచలకు వర్తించదు. ప్రక్కయింటియందు తనయిల్లు కలిపికట్టుయెడల గర్భము పంచలు సమముగానే యుంచవలయును. యెందువల్లననగా రెండుయిండ్లును కలిపినప్పుడు మొత్తము ఒకేయిల్లగును వొక యింటిలో గలుగు పంచకూచములుగూడ తప్పుట దోషమే యగును. యితరయింటిలో కలిపి యిల్లును కట్టునప్పుడు మొత్తమునకు ఒకేఆయమును లెక్కించి నిర్ణయింపవలయును.

గీ॥ మధ్య దేవాలముగాని మఠముగాని।
అన్యగోత్రమువారేని యన్యకులము।
వారలున్నను! నడుమను దారులున్న।
పారుజూడంగవలసిన పనియెలేదు ॥

తా॥ ప్రక్కగాని యెదుటగాని యుండు యిండ్లకును కట్టబోవుయింటికిని మధ్య దేవాలయముగాని, మఠముగాని, యితరగోత్రము వారిగాని యితరకులమువారిగాని యిండ్లు గలిగియున్నను వీధులు గలిగియున్నను, పారు నియమమును పాటింపవలసిన అవుసరములేదు,

ఉ॥ ఆయమునందునం గలుగునంతటిమాత్ర విశాలదీర్ఘముల్।
యాయము దెల్పుగుర్తులుగ యందున మేకులనాటి పిమ్మటన్।
ధీయుత! మూలలుం గొలతలెంతయు వ్యత్యయమందకుండగా।
నాయపు తూర్పుభాగమది యగ్నిదిశంగనకుంట! మేలగున్॥

తా॥ పారుపట్ట నారంభించుటకు పూర్వము దిక్సూచియంత్రసహాయ మునగాని, సూర్యుననుసరించిగాని నలుదిక్కులను నిర్ణయించు కొని లెక్కించిన ఆయమునందుగల పొడవు వెడల్పులను దెలుపునట్టి గుర్తులను భూమియందు నిలుపవలయును. ఆ నిలుపునప్పుడు తూర్పుదిక్కు ఆగ్నేయమును జూడకుండునట్లు నిలిపి మూలలనుకొలిచి సమముగానుండునట్లు చేయవలయును తూర్పుదిక్కు ఆగ్నేయమునుజూచుట యనగా యీశాన్యము ముందునకుపోయి ఆగ్నేయము వెనుకకుపోయిన తూర్పు దిక్కు అగ్నేయమును జూచును. ఆగ్నేయము ముందునకు నకువచ్చి యీశాన్యము వెనుకకుపోయిన యీశాన్యమును జూచును.

గీ॥ పారుపట్టెడు వేళను పట్టుత్రాడు ।
మనుజులాదిగ! దాటగా గనినయెడల ।
మనుజునిడివినిలోతున మహినిద్రవ్వ ।
నెముకలును! బొగ్గు బూడిదలిమిడియుండు ॥

తా॥ పారుపట్టునపుడు ఆత్రాటిని మనుష్యులుగాని, యితర జంతు వులుగాని దాటినయెడల అచ్చోటు మనిషిలోతున త్రవ్వచో యెముకలుగాని, బొగ్గులుగాని, బూడిదగాని, పెంకులుగాని యుండును. వానిని నిశ్శేషముగా దీసివేసి పరిశుభ్రమగు మంటితో నింపవలయును.

గీ॥ పెంకులుండిన కలహముల్బెంచుచుండు ।
బూదెయుండిన రోగముల్పొదవజేయు ।
బొగ్గులుండిన మృత్యువెప్పుడును గలుగు ।
శల్యముల వంశహానియు జరుగునిజము ॥

తా॥ పెంకులుండిన కలహమును బూదెయుండిన రోగములును, బొగ్గు

లుండిన మృత్యువును. యెముకలుండుటవలన వంశనాశమును గలుగును.

## గృహనామము

గీ॥ ఎలమివాకిలిగల దిక్కు- కెదుటిదిక్కు ।
పేర గృహనామమేర్పడు ధీరచరిత ।
వెనుకభాగము పైశాచమనగబరగు ।
గాన హద్దున గృహమును గట్టదగదు ॥

తా॥ ఏకశాలాగృహాలకు తూర్పువాకిలి గలిగిన పడమరిల్లనియు, దక్షిణము వాకిలి గలిగిన ఉత్తరము యిల్లనియు, పడమర వాకిలి గలిగిన తూర్పుయిల్లనియు, ఉత్తరము వాకిలి గలిగిన దక్షిణము యిల్లనియు పేరు. వెనుకవాకిలినిబట్టి లెక్కింపకూడదు. యింటికి వెనుకభాగము పిశాచభాగమనబడును. గనుక యింటిని వెనుకహద్దుయందు గట్టుట కూడదు. స్వల్పముగానైన కాళీస్థలముంచవలయును.

గీ॥ నాల్గుదిశలును తలమున్న గల్గుశుభము ।
మూటగల్గిన! శుభఫలములు నొసంగు ।
మధ్యమంబగు రెండింట మరియునొకట ।
నశుభమంచని! శాస్త్రము నరయవలయు ॥

తా॥ నాలుగుదిక్కులయందుగాని, మూడుదిక్కులయందుగాని కాళీస్థలముంచి యిల్లుగట్టిన శుభఫలమును రెండుదిక్కులమాత్రముంచిన శుభాశుభ మిశ్రఫలమును ఒకేదిక్కుయందుంచిన కష్టఫలమును గలుగజేయును.

## గృహనిర్మాణ శుభాశుభములు

కం॥ తనపేరుండెడు దిక్కును ।
ధనమెక్కుడుగల్గుదిక్కు తనకును శుభమా ।

ధనహీనమైన దిక్కును ।
తనకును శత్రుత్వదిశయు తగను వసింపక ॥

తా॥ గృహనిర్మాణము చేయుటకు అకచటాది వర్గములనుబట్టి తన పేరు యేవర్గమందుండునో ఆదిక్కుగాని ధనమధికముగాగల దిక్కుగాని మంచివి. శత్రువర్గముగల దిక్కుగాని, ధనసంఖ్య తక్కువగానుండు దిక్కుగాని గృహనిర్మాణము కూడను. భూనిర్ణయ భాగమునందు దెలిపిన వర్గనిర్ణయమును గమనింప వలయును.

కం॥ దలపగ వియ్యంకులు దా ।
గలసియు గృహమేకముగను గట్టినయడలన్ ।
గలుగును కీడిరుగడలను ।
సలలితముగ నితరులైన జరుగును శుభముల్ ॥

తా॥ వియ్యంకులిద్దరు అనగా తనకుమార్తె మామయు తానును లేక తనకుమారుని మామయు తానును ఒకగృహము కట్టగూడదు అట్లుకట్టిన చెరుపుగలుగును. యితరులతో కలిపి కట్టవచ్చును.

గీ॥ తరువులనుగొట్టి గేహంబులరయుగట్ట ।
చెడును సంసారమంచని నుడువుచుందు్రి ।
గాన వత్సరకాలంబు గడుపుటుచిత ।
మారుమాసంబులైనను జేరు శుభము ॥

తా॥ చెట్లుగొట్టిన స్థలమునందు సంవత్సరమువరకు గృహనిర్మాణము చేయరాదు. ఆరుమాసములైనను తప్పక విడువవలయును. అట్లు విడువక వెంటనే గృహమును నిర్మించిన సంసారము చెడిపోవును.

సీ॥ పొడవు దక్షిణమున పొడచూపు గృహమున ।
శుభములెల్లప్పుడు జూడగలుగు ।

పడమర పొడవుగా బరగెడు గృహమది ।
యధికలాభంబుతో నలరుచుండు ।
ఉత్తరంబున పొడవుండెడు గృహమందు ।
దుఃఖమెల్లప్పుడు దోచుచుండు ।
పొడవు తూర్పుండగా బడెడు గేహంబున ।
మృత్యుదోషంబులు మిగుల గలుగు ।

గీ॥ గాన దక్షిణ పడమర గలిగి దీర్ఘ ।
ముత్తరము తూర్పు హ్రస్వమైయున్న శుభము ।
ఉత్తరము తూర్పు బొడవైన నొసగుకీడు ।
ఇట్లెరిగి యిండ్లుగట్టగ నిచ్చుమేలు ॥

తా॥ దక్షిణము పొడవుగలిగిన గృహము శుభఫలమును, పడమర పొడవుగలిగిన గృహము అధికమగు లాభమును, ఉత్తరము పొడవుగలిగిన గృహము దుఃఖమును, తూర్పుపొడవుగలిగిన గృహము మృత్యుదోషములను గలిగించును. గనుక యిండ్లు దక్షిణము పడమర పొడవుగావుండి ఉత్తరము తూర్పు కురుచగా నున్నయెడల ఆయుశ్వర్యాభివృద్ధిని గలిగించును.

గీ॥ పంచ గర్భమునకుమించి పనికిరాదు ।
మధ్య కూచములుంచియు మరియు పంచ ।
పెంచగావచ్చు నొకటికిమించి గర్భ ।
ములుగలుగ! నాయమొకటిగా గలుగుచుండు ।

తా॥ గర్భముకన్న పంచ పెద్దదిగా యుండకూడదు. కొంచమైనను తక్కువగా యుండవలయును. గర్భమునకు తగ్గియుండునట్లు కూచములనుంచి మరలపెంచవచ్చును. మధ్య కూచములున్న ఒకే పంచగాదు. వొకగర్భముగాక రెండుగాని మూడుగాని గర్భములతో ఒకగృహమును నిర్మింపదలచినప్పుడు గర్భము

లన్నిటికి కలిపి యొకటిగానే ఆయమును లెక్కింపవలయును. అనగా ఒక గర్భమునకు పొడవు గజములను నాలుగుతో లెక్కించినట్లు, రెండుగర్భములైన యెనిమిది గజములతోడను మూడుగర్భములైన పండ్రెండు గజములతోడను, లెక్కించి ధనఋణాదివర్గ శుభత్వమును తెలుసుకొనవలయును.

గీ॥ గర్భమునకును సగముగా గలుగునట్లు ।
గదినినిర్మింప! నిండ్లకు నొదవ్రమేలు ।
మిద్దె డాబాలయందున మించవచ్చు ।
దక్షిణంబును పడమర దగదుకురుచ ॥

తా॥ యిండ్లుకట్టునప్పుడు గదిని గర్భములో సగముకొలతకు కొంచె మించుమించుగా నుండునట్లు పెట్టవలయును. డాబాలు మిద్దెలు వీనికి కొంత హెచ్చుగాపెట్టినను పెట్టవచ్చును. గదులన్నియు సమముగానుండునట్లు పెట్టవలయుచు. హెచ్చుతగ్గులుగా పెట్టు నప్పుడు దక్షిణము పడమర గదులు ఉత్తరము తూర్పులకన్న తగ్గియుండునట్లు పెట్టగూడదు.

## గృహారంభములు

గీ॥ సదనమారంభమును జేయు విధములిట్లు ।
మూడు తెరగుల నగుచును గూడియుండు ।
శంకువును కూచమును నిల్పజాలుటయును ।
శిలను నిల్పుటయన మూడు నలరుచుండు ॥

తా॥ గృహారంభముచేయుట మూడువిధములుగా నుండును. శంకు స్థాపనము స్తంభప్రతిష్ట శిలాస్థాపనము అను రీతులైయుండును

## శంకుకు పనికివచ్చు కొయ్యలు

గీ॥ కానుగును! మద్ది, యేపెయు, కడవ, మరియు ।
కొడిశపాలము! శ్రీతాళ కుముదికములు ।

పారిజాతము! కాంచనదారుచండ్రి ।
యనెడు దారువు! శంకునకగును శుభము ॥

తా॥ కానుగ, మద్ది, యేపె, కడప, కొడిశపాల, శ్రీతాళము, ఏకు పారిజాతము, దేవకాంచనము, చండ్రి యనుదారువులు శంకు చేయుటకు పనికివచ్చును.

## శంకుకు కూడని దారువులు

గీ॥ అత్తి మామిడి మఱ్ఱియు నవిశతాడి ।
వేపజువ్వియశోకము వెదురుతాండ్రి ।
జెముడు! నశ్వత్థమును ముండ్లజెలగుచెట్లు ।
దగ్ధదారువు! శంకుకు తగదుసుమ్ము ॥

తా॥ అత్తి, మామిడి, మఱ్ఱి, అవిశ, తాడి, వేప, జువ్వి, అశోకము, వెదురు, తాండ్రి జెముడు, రావి, యివియును ముండ్లుగల చెట్లును, పాలుగలచెట్లును, కాలినకొయ్యలును, శంకుకు పనికిరావు.

## శంకు పరిమాణము

గీ॥ ఆరు అంగుళ పరిధియు బారుతొమ్మి ।
దాది నాలుగు మధ్య మందష్టముఖము ।
లగ్రిభాగంబు వట్రివలగుచునుండ ।
పతికి! గృహమునకు భయశుభప్రదంబు ॥

తా॥ ఆరు అంగుళములు చుట్టుకొలత కలిగి తొమ్మిదంగుళములు పొడవుగలిగి క్రిందిభాగము నాలుగు పలకలును మధ్య భాగము యెనిమిది పలకలును చివరిభాగము గుండ్రమును సమభాగములుగా గలిగిన శంకు చేయుటవలన యజమానికిని గృహమునకును మేలుకలుగును.

## శంకుస్థాపనవిధి

కం॥ పసుపును కుంకుమపుష్పము ।
లసమంబగు భక్తితోడ నర్పించియు శ్రీ ।
వసుదేవసుతుని దలచుచు ।
నెసగగ! నీశాన్యమూలనే నిల్పదగున్ ॥

తా॥ శంకునకు పసుపు కుంకుమలంబెట్టి పుష్ప గంధాక్షతలచే పూజించి భగవంతుని ధ్యానింపుచు తానేర్పరచబోవు గృహమునకు యీశాన్యదిశయందు స్థాపించవలయును.

## దారునిర్ణయము

గీ॥ తొఱ్ఱలుండుట! తేనెలతుట్టెలుంట ।
దైవనామాంకితంబులై దనరుచుంట ।
వల్లికావేష్టితంబులై వరలుచుంట ।
నైన కొయ్యలు! నిండ్లకునశుభకరము ॥

తా॥ గృహనిర్మాణమునకుపయోగించు కొయ్యలు తొఱ్ఱలు గలిగి యుండుటగాని దేవునిపేరుతో పిలువబడుచెట్లు నరికినవిగాని తీగలచే చుట్టబడినవిగాని పనికిరావు.

గీ॥ దక్షిణము పశ్చిమమును మొదళ్లుగలిగి ।
నుత్తరము తూర్పుకొనలచే నొప్పియుండి ।
శంకునకు! యోగ్యమగు దారుసంఖ్య! వెనుక ।
గృహ నిర్మాణమున శుభావహములగును ।

తా॥ శంకు నిర్మాణమునకు చెప్పబడిన కొయ్యలును వెనుకను యిండ్లుగట్టుటకు శ్రేష్టమైనవి గృహమును నిర్మించు కొయ్యలును, మొదళ్లు దక్షిణ పడమర దిశలయందును చివరలు ఉత్తరము తూర్పులును గలిగియుండునట్లు అమర్చుట శుభము.

గీ॥ కొత్తకొయ్యలు పాతవి కూర్చికట్ట।
నశుభఫలములు నిచ్చు నాయధిపునకును।
కొత్తవేయన్నియైనను గూర్ప శుభము॥
పాతవన్నియుగూర్పగా ఖ్యాతిగూర్చు॥

తా॥ కొన్ని కొత్తకొయ్యలును కొన్ని పాతకొయ్యలును చేర్చి వారి యింటికి వుపయోగింపగూడదు అన్నియు కొత్తకొయ్యలైనను అన్నియు పాతవైనను ఉపయోగించిన శుభప్రదమగును.

కం॥ సమమగు! దూలంబులచే।
నమరంగాగట్టు గృహము లధికశుభంబౌ।
సమహీనమైన! దూలము।
లమరంగాగట్టు గృహములార్తిని గూర్చున్॥

తా॥ గృహమునకు సమానమగు దూలములుండిన శుభకరమును బేసి సంఖ్యగల దూలములుండిన కష్టకరమును యగును.

గీ॥ దంతులవిబేసియుండిన దనరుమేలు।
సమముగానుండ చెరుపులు జరుగునిజము।
బైట ప్రహరిని! బెట్టగా బడెడువాకి।
లింటివాకిలికిని మించియుంట మేలు॥

తా॥ దంతులు బేసిగానుండుటవలన శుభఫలమును సమముగా నుండుటవలన చెరుపును గలుగును. బైట ప్రహరీయందు బెట్టువాకిలి యింటిద్వారముకన్న పెద్దదిగా యుండవలయును. చిన్నదగునేని ద్వారవేధ గలుగును.

## ద్వారనిర్ణయము

గీ॥ వెలయ నవభాగములుగ గావింపబడిన।
ఇంటిపొడవున కధిపతులంట గృహము।

లందు! బుణ్యాధిపత్య మధ్యాంశములను ।
ద్వారముఖకల్పనంబు! శుభప్రదంబు ॥

తా॥ ఇంటిపొడవును తొమ్మిదిభాగములు చేయగా తొమ్మిదిభాగములకును సూర్యుడు మొదలు తొమ్మిదిగ్రహములు వరుసగా అధిపతులగుదురు. యెట్లన ప్రథమభాగమునకు రవియు ద్వితీయభాగమునకు చంద్రుడును, తృతీయభాగమునకు కుజుడును, చతుర్థభాగమునకు బుధుడును, పంచమభాగమునకు గురువును, షష్టమభాగమునకు శుక్రుడును, సప్తమభాగమునకు శనియు, అష్టమభాగమునకు రాహువును, నవమభాగమునకు కేతువును అధిపతులగుదురు. మధ్య మూడుభాగములగు బుధ, గురు, శుక్ర భాగములయందు సింహద్వారమును బెట్టిన శుభఫలము గలుగును. క్రూరగ్రహ స్థానములగు మొదటి మూడు భాగములయందుగాని, చివర మూడు భాగములయందుగాని సింహద్వారముంచు నెడల అశుభఫలమును గలుగును. తూర్పు సింహద్వారముగల యింటికి యీశాన్యము మొదలుగను దక్షిణద్వారము గలయింటికి ఆగ్నేయము మొదలుగను, పడమరద్వారముగల యింటికి నైరుతి మొదలుగను, ఉత్తరద్వారముగల యింటికి వాయువ్యము మొదలుగను ద్వార స్థానాధిపతుల నిర్ణయింప వలయును.

గీ॥ ఒప్పు! నాతినిమ్నంబు! నాత్యున్నతంబు ।
భవనమున కెప్పుడేమ్ముఖ! ద్వారముంట ।
మిగులువాకిళ్లదానికి! మిగులుగాక ।
అమరియుండుట యెల్ల శుభావహంబు ॥

తా॥ ఇంటికిబెట్టబడు సింహద్వారము అధికముగా యెత్తు వెడల్పులుగాని, స్వల్పమగు యెత్తు వెడల్పులుగాని లేకుండునట్లు పెట్ట

వలయును. సింహద్వారముకన్న లోపలిభాగమున గలుగు వాకిండ్లు చిన్నవిగా యుండునట్లు బెట్టిన శుభము గలుగ జేయును.

గీ॥ అరువదియునాల్గు యెత్తునై యరయ విస్త।
రంబు! ముప్పదినాల్గంగుళంబులైన।
నట్టివాకిలి! శుభమగు నధికమైన।
హీనమైయున్న! క్షుత్పీడనిచ్చు నిజము॥

తా॥ ఇంటి ముఖద్వారము అరువది నాలుగంగుళముల యెత్తును ముప్పదినాలుగంగుళముల వెడల్పును గలిగియున్న శుభమును గలుగజేయును. యీపరిమాణమునకు మించియున్నను తగ్గియున్నను ఆకలివలన పీడింపబడువారగుదురు.

గీ॥ ద్వారమున మిశ్రదారువుల్జేరియుంట।
చూడ నాశ్చర్యమునుగల్గ గూడియుంట।
తలుపులకు సరి పలకలు గలిగియుంట।
యింటగలవారి కశుభంబులిచ్చు నిజము॥

తా॥ ద్వారములయందు పలురకముల కొయ్యలు గలిగియున్నను, తలుపులకు సరిసంఖ్యగలుగు పలకలు గలిగియున్నను, చూచుటకు వింతగొల్పునట్లు గనుపించినను గృహస్థులకు చెరుపు చేయును.

కం॥ వాకిలి కెదురుగ బెట్టెడు।
వాకిండ్లను! బెట్టునపుడు వరుసగనుంచన్॥
ప్రాకటముగ! నైశ్వర్య।
శ్రీకల్గును! దప్ప దోష రేఖదనర్చున్॥

తా॥ వాకిలికి యెదురుగా బెట్టబడు వాకిండ్లు వరుస తప్పకుండా బెట్టవలయును. వరుస దప్పకయుండు యెడల అయిశ్వర్యవృద్ధిని

గలిగించును. వొకటికొకటికి తప్పియున్న యెడల వంశక్షయము గలుగును. ద్వారముల మధ్యభాగము సమముగా నుండుచే వరుస తప్పకుండుటయగును.

గీ॥ ప్రక్క వాకిండ్లు! లోపలిభాగమందు ।
నుంచువాకిండ్లు! గర్భంబు కెంచ మధ్య ।
నుండగూడదు! రోగంబులుండజేయు ।
మధ్య తప్పించిబెట్టుట మంచిదగును ॥

తా॥ ప్రక్క భాగమున బెట్టు వాకిండ్లనుగాని, లోపలిభాగమున గదులకు పెట్టు వాకిండ్లనుగాని దూలము మధ్యగాబెట్టు నెడల యింటిలోనుండువారు రోగవంతులగుదురు. దూలముపొడవును రెండు భాగములుజేసి యే భాగమందైనను బెట్టవలయును. గుంటదూలము లుండు నెడల వెన్నుగాడికెదురు గుంటదూలమునకును ప్రక్కనుండు గుంటదూలమునకును మధ్యయందు ద్వారమును బెట్టవలయును.

కం॥ దలపగ దూలముక్రిందను ।
వెలసెడు వాకిండ్లు! మిగులవిపదావహముల్ ।
అలమర కిటికీలుండుట ।
గలిగినచో గీడుదెచ్చు గనుగొనవలయున్ ॥

తా॥ వాకిండ్లనుగాని, కిటకీలనుగాని, అలమరలనుగాని దూలము క్రిందుగా బెట్టకూడదు. అట్లు బెట్టినయెడల చెరుపు గలుగజేయును.

కం॥ సరిసంఖ్య యుండునట్లుగ ।
పరికించియు! ద్వారములను బరపుటశుభమా ।
అరమర కిటికీలైనను ।
సరిగాకుండంగ నెందు జరుగును కీడుల్ ॥

తా॥ ద్వారములు, కిటికీలు, అలమరలు వేనికవి సరిసంఖ్య గలిగి యుండునట్లు బెట్టవలయును. బేసిగానున్న యెడల చెరుపు గలుగజేయును.

సీ॥ నాలుగుదిక్కుల నలరుచో వాకిండ్లు॥
శుభదమై పతికిని శుభముగూర్చు।
తూర్పుదిక్కునగాక యేర్పడమూటను।
పశు మృగ తస్కర బాధగలుగు।
దక్షిణంబును లేక దగమూటనుండెడు।
వాకిండ్లు! గలిగిన భాగ్యమిచ్చు।
పడమరలేకయె! బరగ మూడిటనున్న।
పుత్రపౌత్రసుఖాప్తి బొదలుచుండు॥
గీ॥ ఉత్తరములేక! మూడిటనుండియున్న।
రాజభీతియు! పీడలు తేజభంగ।
మొదవుగావున! ద్వారంబులొదవజేయు।
ఫలితములనెల్ల నెరిగియు నిలుపవలయు॥

తా॥ ఇంటికి నలుదిక్కుల వాకిండ్లు గలిగియున్న యజమానికిని కుటుంబమునకును శుభఫలములు గలుగును. దక్షిణము, పడమర, ఉత్తరము వాకిండ్లుండి తూర్పుదిశ ద్వారములేని యింటియందు పశువులవలనను, మృగములవలనను, దొంగలవలనను పీడితముగలుగును. తూర్పు, ఉత్తరము, పడమర వాకిండ్లు గలిగి దక్షిణదిశ వాకిలిలేని గృహమున భాగ్యవృద్ధిగలుగును. తూర్పు, దక్షిణము, ఉత్తరము వాకిండ్లుగలిగి పడమరదిశ వాకిలిలేని గృహమున పుత్రపౌత్రాభివృద్ధి గలుగును తూర్పు దక్షిణము, పడమర వాకిండ్లుగలిగి ఉత్తరదిశ వాకిలిలేని గృహమున రాజపీడితము, లాభహీనమును, కష్టములును గలుగును.

గీ॥ ఇంటిముందును! ప్రక్కల యింటివెనుక ।
గలుగు ప్రహరిని! నుండగా గలుగునట్టి ।
ద్వారములుచేర్చి! గణియింపదలపవలదు ।
పంచలతోచేర్చి! లెఖ్ఖగా నెంచవలయు ॥

తా॥ ఇంటికి ముందును వెనుకను ప్రక్కను గలుగు ప్రహరీగోడల యందు గలుగు వాకిండ్లు లెఖ్ఖ లో చేరవు. పంచలతోసహా కలిపి యింటికిమాత్రిమే లెక్కించవలయును.

## ద్వారవేధలు

గీ॥ ఇంట బయటను! వాకిలికెదుట! నెపుడు ।
కంబములు! గోడ మూలలుగలిగియుంట ।
పరులదూలముల్! వృక్షముల్పరగుచుంట ।
కష్టముల కాలవాలంబు గలదియగును ॥

తా॥ ఇంటిముందుగాని వెనుకగాని లోపలగాని వాకిండ్లకు యెదురుగా స్తంభములుండినను గోడ మూలలుండినను యితరుల యిండ్లదూలములు గలిగియున్నను వృక్షములుండినను ఆయిల్లు కష్టములకు నిలయమగును.

సీ॥ వాకిటికెదురుగా వరలెడు రచ్చచే ।
నిలయకర్తకు నాశమొలయజేయు ।
వాకిలికెదురుగా వసుధారుహంబున్న ।
సంతతి నాశంబు జరుగుచుండు ।
వాకిటికెదురుగా పంకంబుగల్గిన ।
దుఃఖంబులెప్పుడు దోచుచుండు ।
వాకిటికెదుటను వారిధిగల్గిన ।
నధికమౌ ధన నాశమగుచునుండు ।

గీ॥ బావి! యెదురున్న వ్యాధుల బాధగలుగు ।
దేవతాలయ మెదురున్న దెచ్చుకీడు ।
స్తంభ మెదురైన! స్త్రీదోష సంభవంబు ।
యిట్లుగా! ద్వారవేధల నెరుగవలయు ॥

తా॥ వాకిలికి యెదురుగా రచ్చయుండిన యజమాని నష్టమును, చెట్లుగలిగిన సంతాననాశమును, బురదయుండిన దుఃఖమును ప్రవాహముండిన ధననష్టమును, బావియున్న రోగపీడితమును దేవాలయముండిన కష్టములును, కూచములుండిన స్త్రీనాశ మును గలుగును.

గీ॥ ద్వార మెత్తుకు రెట్టింపు మేర దూర ।
ముండినట్లైన! దోషంబులుండబోవు ।
వెన్నుక్రిందుగ ద్వారంబు బెట్టదగదు ।
వెన్నునిలువున నడచిన వెతలగూర్చు ॥

తా॥ ద్వారమునకు రెండంతల దూరమున గలిగియుండు ద్వారవేధ గలిగించునవి యేవియున్నను దోషముండదు (దోషము స్వల్ప ముగా తన స్థలమున్నంతవరకు గలిగియుండును) వెన్నుగాడి క్రింద వాకిలి పనికిరాదు. వెన్నునకు నిలువుగా ద్వారముబెట్టి నడచినయడల కష్టములు గలుగజేయును.

## వెనుగాడి నిర్ణయము

గీ॥ వరుసగా వెన్నుగాడులు భవనములకు ।
నున్న! మేలగు నిలువడ్డమున్న కీడు ।
సౌధముల! కొంటి దూలపు సదనములకు ।
వెన్నుగాడుల దోషమ్ము లెన్నదగదు ॥

తా॥ వెన్నుగాడులన్నియు వొకేవిధముగా నుండవలయును. వెన్ను గాడులు అడ్డముండు వానికి యెదురుగా నిలువగు వెన్నుగాడితో

గట్టిన దోషము గలుగును. యిందువలన ఉభయ గృహముల వారును నశింతురు. యీవెన్నుపోటి దోషము కనుపడునంత దూరము వరకు యుండును. రెండు వెన్నుగాడులకుమధ్య వీధు లుండినను యీదోషమును పోగొట్టజాలవు. యీదోష ఫలము ముందు ఉత్తరము, తూర్పు గలుగువారికిని పిదప దక్షిణము, పడమర గలుగువారికిని సంభవించును. వొంటి దూలముగల యిండ్లకును, మిద్దెలకును, డాబాలకును వెను పోటి దోషములేదు.

గీ॥ వెన్ను! మధ్యగనుండిన వెలయుసుఖము ।
మధ్య తప్పినకష్టముల్ తధ్యమగును ।
వెన్నుచివరైన! పోటిగానున్న యిల్లు ।
కష్టములపాలుజేయుట గనగవలయు ॥

తా॥ వెన్నుగాడియింటికి మధ్యగా నుండునట్లు నిర్మింపవలయును. వెన్నుగాడి మధ్య తప్పిన యింటియందుండువారు అనేక కష్టములను యనుభవింతురు. వెన్నుపోటి చివరభాగమువరకు గలిగియుండును. గనుక చివరిభాగముగూడ పోటిగా నుండ గూడదు.

## అడ్డదూలదోషము

గీ॥ అడ్డదూలంబులుండుట చెడ్డయగును ।
రెండుమూడగు గర్భంబులుండు నెడల ।
నొకటికొకటికి మధ్యగా నొనరనిల్పు ।
దూలములకును దోసంబు దొసగకుండు ॥

తా॥ దూలములడ్డముగా నుండగూడదు. రెండుగాని మూడుగాని గర్భములను కలిపి వొకేహాలుగా యుంచుకొరకు మధ్య నమర్చబడు దూలములకు అడ్డదూలమను దోషము వర్తిం

చదు. యెంనువల్లననగా గర్భములమధ్య గలుగు దూలము సామాన్యముగా వాకిలివద్దనుండి రెండింతల దూరమునకు తక్కువగా యుండదు.

## యెత్తున ద్వారంబుండు దోషము

కం॥ మిట్టన ద్వారంబుండియు ।
నట్టిల్లది! పల్లుగల్గ నశుభంబాదవుఁ ।
చుట్టుగల పంచలెల్లను ।
నట్టింటెనిమించు యెత్తు నదియును చెరుపౌ ॥

తా॥ నట్టిల్లు పల్లముగనుండి యెత్తుగాయుండునట్లు సింహద్వార మండిన చెరుపుగలుగును. చుట్టును గలిగియుండు పంచలు గర్భాయమునకు మించెడు యెత్తుగలిగియున్న చెరుపు గలుగ జేయును.

## బావి నిర్మాణఫలము

సీ॥ ఈశాన్యదిక్కునందిచ్చును విభవంబు ।
తూర్పున సంపద దోచుచుండు ।
ఆగ్నేయమందున యగు నష్టసంతతి ।
దక్షిణంబున భార్య దగనశించు ।
నైరుతిదిశయందు జేరు మృత్యుభయంబు ।
పశ్చిమదిశయందు భాగ్యవృద్ధి ।
వాయవ్యమందున వైరిపీడలుగల్గు ।
నుత్తరదిశయందు నొసగు సుఖము ॥

గీ॥ గాన శుభఫలముండెడు క్రమముదెలిసి ।
బావి! త్రవ్వంగ సుఖములు బడయగలరు ।
చెడ్డదిక్కులగల బావి చెరుపుచేయు ।
నిట్లుగా! కూపఫలముల నెరుగవలయు ॥

తా॥ ఈశాన్యమున బావిత్రవ్విన అయిశ్వర్యవృద్ధియు, తూర్పున సంపదయు, ఆగ్నేయమున పుత్రనాశమును, దక్షిణమున భార్య నశించుటయు, నైరుతిదిశయందు మృత్యుభయమును, పడమర భాగ్యలాభమును, వాయువ్యమున శత్రుపీడితమును, ఉత్తరమున సుఖమును గలుగును.

గీ॥ నూత! నింటికూపంబు గన్గొంట గలుగ ।
కర్తకును! బ్రాణసతి పశుక్షయముగలుగు ।
యితరబావులకీదోష మెసగకుండు ।
గడకి: మధ్యను బావియు గలుగమేలు ॥

తా॥ బావిమధ్యను జూచునట్లు యింటికూపములు గలిగియున్న పశునష్టమును భార్యానాశమును యజమాని నష్టమునుకలుగును యితరుల బావియగునెడల దానిమధ్యను కూపములు జూచినను దోషముండదు. గదికి మధ్యగానుండు బావి దోషరహితమగునది యగును.

## నట్టిల్లు వాటము

కం॥ నట్టిల్లెత్తుచు పడమర ।
బెట్టగా! వంశవృద్ధి వెలయుచునుండుఁ ।
అట్టులె! దక్షిణముండిన ।
దిట్టతనంబిచ్చి! ధనము తేజముగూర్చుఁ ॥

తా॥ నట్టిల్లు దక్షిణము పడమర యెత్తుగను ఉత్తరము తూర్పు పల్లముగను యున్నయడల ధనమును అయిశ్వర్యమును గలుగ జేయును.

## యింటికప్పు వాటములు

సీ॥ కప్పువాటంబులుగలరీతు! లెనిమిది ।
క్రమమొప్పు! క్షితిని విఖ్యాతిగనియె ।

పాంచాలవైదేహి బరగంగ కౌరవ ।
రాజన్య మాగధల్ రమణమీర ।
శూరసేనగాంధార శుభదమౌ యావంతి ।
యనుపేరులనుగల్గి యవనియందు ।
పాంచాలమగు! నింటివాటంబు నడిమెత్తు ।
పాదాదిక విశాల భాతినొప్పు ॥

గీ॥ నట్టి! వాటంబునకు జంటలంగుళములు ।
వరుసగా బెంచి! నడిమెత్తవాటములగు ।
రెండు! నాలుగు నైదారు రీతులరయ ।
మనుజులకు నెల్ల శుభదమై మహిజెలంగు ॥

తా॥ యింటి కప్పువాటములు యెనిమిది విధములుగాయుండును. గోడలమధ్యకుండు వెడల్పు కొలతతో నాల్గవభాగమును పెంచి ఆకొలతగల త్రాటిని గోడలమధ్య రెండుకొనలను పట్టుకొని మధ్యభాగమును పైకెత్తిన యేర్పడువాటమునకు పాంచాలమనిపేరు. దానికన్న రెండంగుళములు హెచ్చుగలది వైదేహివాటమనబడును. వైదేహివాటముకన్న రెండంగుళములు బెంచిన కౌరవవాటమగుచు. కౌరవ వాటముకన్న రెండంగుళములు బెంచిన రాజన్యవాటమగును. రాజన్య వాటముకన్న రెండంగుళములుబెంచిన మాగధవాటమగును. మాగధవాటముకన్న రెండంగుళములు బెంచిన శూరసేన వాటమగును. శూరసేనవాటముకన్న రెండంగుళములుబెంచిన గాంధారవాటమగును. గాంధారవాటముకన్న రెండంగుళములు బెంచిన అవంతివాటమగును. యీయెనిమిది వాటములలో వైదేహివాటమును, రాజన్యవాటమును, మాగధవాటమును, శూరసేనవాటమునను నాలుగువాటములు గృహమునకు శుభఫలమిచ్చును.

## గృహ నిర్మాణమున గమనింపదగినవి.

గీ॥ గర్భమునమధ్య దూలానకడ్డుగోడ ।
గదికిమధ్యను! కొయ్యలు గలుగుగోడ ।
భగ్నమగు! దూలములుగల్గి వరలు గృహము ।
కష్టముల గల్గజేయగా గలది యగును ।

తా॥ గర్భము మధ్యభాగమున దూలము నిలువుగా నున్నపుడు అడ్డముగా గోడకట్టుట, గదిమధ్యభాగమున కొయ్యలతో అడ్డముగట్టుట, విరిగిన దూలములు వేయుట పనికిరాదు. అట్లుండిన కష్టములు గలుగజేయును.

### ఉపగృహ నిర్మాణము

సీ॥ పూర్వదిశాగ్నేయముల మధ్య దధిశాల ।
దక్షిణాగ్నేయాల దంపుశాల ।
అలసవ్యాని ఋతుల్ మలమూత్రములశాల ।
పశ్చిమ నైరుతుల్వరగ విద్య ।
పడమర వాయువునడుమ రోదనశాల ।
వాయూత్తరంబుల వరలుక్రీడ ।
గిరిశోత్తరముల! చికిత్సశాలయు మరి ।
పూర్వమీశానల పురటిగృహము ॥

గీ॥ నిట్టి! తెరగుల నుండంగ నెనిమిదైన ।
దిక్కులకు! మధ్యగృహములు దీర్చిగట్ట ।
మర్త్యులెల్లరు! శుభమును మహిమగలిగి ।
ధనికు! లైశ్వర్యవంతులై దనరుచుంద్రు ॥

తా॥ తూర్పు ఆగ్నేయముల మధ్యభాగమున మజ్జిగ చిలుకు గృహమును, దక్షిణము ఆగ్నేయములమధ్య దంపుపని గృహమును

దక్షిణము నైరుతి దిశలమధ్య విద్యాగృహమును, పడమర వాయువ్యములమధ్య విచారగృహమును, వాయువ్యము ఉత్తరములమధ్య ఆటలాడు గృహమును, ఉత్తరము యీశాన్య ములమధ్య సూతికాగృహమును నిర్మింపవలయును.

సీ॥ తూర్పుకు! దిక్కునందుండు స్నానపుశాల ।
ఆగ్నేయమందుండు నగ్నిశాల ।
దక్షిణదిక్కున దగపడుండెడుశాల ।
నైరుతిదిక్కున నస్త్రశాల ।
పశ్చిమదిక్కున జరగు భోజనశాల ।
వాయువ్యమందున పశుగృహంబు ।
ఉత్తరదిక్కునందుండ సాధనశాల ।
యీశాన్యదిశను మహేశుశాల ॥

గీ॥ ఇట్టులెనిమిది దిక్కుల నిండ్లుగట్ట ।
సర్వసౌభాగ్య సౌఖ్యముల్! పర్వజేయు ।
గాన! నిట్టుపగృహములు గట్టవలయు ।
శ్రేయములగోరు మానవ శ్రేణియెల్ల ॥

తా॥ తూర్పున స్నానగృహమును, ఆగ్నేయమున వంటగృహమును, దక్షిణమున శయనగృహమును, నైరుతియందు శస్త్రగృహ మును, పడమర భోజనగృహమును, వాయువ్యమున పశు గృహమును ఉత్తరమున ధనాగారమును, యీశాన్యమున దేవగృహమును, నిర్మించుటవలన క్షేమ సౌఖ్యములు గలుగ జేయును.

## ద్విశాల లక్షణము

సీ॥ శమన పశ్చిమముల నమరగట్టు ద్విశాల ।
నైశ్వర్యవృద్ధిచే నలరుచుండు ।

పశ్చిమోత్తరముల బరగెడు ద్వయశాల।
చోర! పీడామయ కారణంబు।
ఉత్తరం! బును తూర్పు నొప్పుచుండు ద్విశాల।
భయముచే నెప్పుడు బాధపెట్టు।
తూర్పు దక్షిణములందుండెడు ద్వయశాల।
వృశ్చిక! సర్పాది భీతిగొలుపు॥

గీ॥ గాన! ద్వయశాల గట్టగా కాంక్షగల్గు।
మనుజులెల్లను! నీవిధి మదినెరింగి।
గట్టగా మేలుగల్గుట కెట్టి సాది।
యంబు! లేదనుపల్కు తెల్లంబువినుము॥

తా॥ దక్షిణదిక్కును, పడమరదిక్కును కలిపికట్టు ద్విశాల అయిశ్వర్యమును వృద్ధిజేయును. పడమర, ఉత్తర దిక్కులయందు గలుగు ద్విశాల దొంగలభయమును, రోగపీడితమును గలుగజేయును. ఉత్తరము, తూర్పుదిక్కుయందుగల ద్విశాల యెల్లప్పుడు భయముచే బాధించునది యగును. తూర్పును దక్షిణమును గలిగియుండు ద్విశాల విషజంతు భీతి గలుగజేయును. గావున ద్విశాల గట్ట కోరికగలవారు శుభాశుభ దిక్కులనెరింగి నిర్మింపవలయును.

## త్రిశాల లక్షణము

సీ॥ పూర్వదిక్కునగాక మూడుదిక్కులనుండు।
త్రియశాల సంకల్పిత ప్రదంబు।
దక్షిణంబున లేక దనర మూడిటనున్న।
శత్రుపీడనములు జరుగుచుండు।
పశ్చిమంబున లేక బరగ మూడిటగల్గ।
బహువిధ కష్టముల్ప్రబలజేయు।

ఉత్తరంబున లేక నొనర మూడిటనుండ ।
బొనరించు యశమును బుత్రవృద్ధి ॥

గీ॥ నిట్లు! త్రియశాల ఫలముల నెరుగవలయు ।
దక్షిణద్వార హీనంబు దనరిమూడు ।
దిక్కులను! ద్వారములచేత దేజరిల్లు ।
భవనమెప్పుడు! శుభఫలావహముసుమ్ము ॥

తా॥ దక్షిణము, పడమర, ఉత్తరము గలిగియుండు త్రిశాల కోర్కె లను సిద్ధింపజేయును. తూర్పు, పడమర, ఉత్తరము గలిగి యుండు త్రిశాల అనేకవిధములగు కష్టములను గలుగ జేయును. తూర్పు, దక్షిణము, పడమర గలిగియుండు త్రిశాల కీర్తివృద్ధియు, పుత్రలాభమును గలుగజేయును. త్రిశాలకు తూర్పు, పడమర, ఉత్తరము ద్వారములుండి దక్షిణదిశ ద్వారములేకున్న ఆయిల్లు యెల్లప్పుడు శుభములను గలి గించును.

## చతుశ్శాల లక్షణము

సీ॥ నలుదిక్కులనుగట్టు నిలయంబు తాజతు ।
శ్శాలనామంబున జరుగుచుండు ।
ప్రాగ్ద్వారకలితమై బరగు జతుశ్శాల ।
పశువృద్ధి! సంపదల్ యశముగూర్చు ।
దక్షిణద్వారంబు ధరగూడియుండెడు ।
చతుశాలయందున సుతసమృద్ధి ।
పశ్చిమద్వారమై బరగెడు చతుశాల ।
రాజిల్లు! చుండును రత్నవృద్ధి ॥
గీ॥ ఉత్తరంబున వాకిలి నొప్పు చతుర ।
శాల! నాలయకర్తకు జాలవృద్ధి ।

నొనర గావించు! గావున ననవరతము ।
సర్వతోభద్రమనుపేర నుర్వి జెలగు ॥

తా॥ నాలుగు దిక్కులయందునుగల యిండ్లను కలిపికట్టబడు గృహమునకు చతుశ్శాలయని పేరు. యీచతుశ్శాలకు తూర్పుదిక్కుమాత్రమే ద్వారముండిన పశువృద్ధి గలుగజేయును. దక్షిణము మాత్రము ద్వారముండిన సంతానవృద్ధిని గలుగజేయును. పశ్చిమర మాత్రము ద్వారముండిన రత్నవృద్ధిని గలుగజేయును. ఉత్తరము మాత్రము ద్వారముండిన జయమును గలుగజేయును. చతుశ్శాల యేదిక్కుద్వారము గలిగియున్నను శుభఫలమునే గలుగజేయును. గాన సర్వతోభద్రమను పేరున బిలువబడుచుండును.

## అంతస్తు వాకిండ్ల లెఖ్ఖ క్రమము

గీ॥ ఒక్కటికి మించి యంతస్తులొప్పనేని ।
ద్వారములనుంచునప్పుడు వేరుగాక ।
క్రిందనుండెడు! వాకిండ్ల చందముననె ।
నిల్పి! మొత్తము లెక్కగా నెరుగవలయు ॥

తా॥ ఇంటికి యెన్ని అంతస్తులున్నను, ఆ మొత్తము అంతస్తులందుగల వాకిండ్లు, కిటికీలు, అలమరలు వొక్కటిగానే లెక్కింపవలయును. క్రిందనుండు వాకిండ్లవలెనే, పైభాగమందుగూడ వాకిలున్నచోట వాకిలిని కిటికీయున్నచోట కిటికీని అలమరున్నచోట అలమరను పెట్టవలయును. తప్పించి పెట్టగూడదు. యెందరు భాగస్తులు కలిసి ఒక యిల్లు కట్టినను, ఆ మొత్తము యింటికి కలిపియే ద్వారములు, కిటికీలు, అలమరలు లెక్కింపవలయును.

## మెట్లు నిర్ణయము

ఉ॥ పైనను! గట్టగాబడెడు భాగము నెక్కఁగ! మెట్లుగట్టఁగన్ ।
లోననుగానియున్నయెడ నొప్పెడి! యేదిశనైనగానియున్ ।
వీనినిగూర్చి సందియము వీడవలెం! దగ క్రిందివాకిటన్ ।
లోనికిబోవ మెట్లు! లెటులో యటులేయివి! గట్టనయ్యెడిన్ ॥

తా॥ పైభాగమున గట్టబడు అంతస్థులను యెక్కుటకు లోపల భాగమునగాని, వెలుపలభాగమునగాని యేదిక్కుయందైనను మెట్లను గట్టవచ్చును. యింటికి క్రిందభాగమున గలుగు వాకిండ్లవద్ద గట్టబడు మెట్లు యెట్టివో పైభాగము నెక్కుటకు గట్టబడు మెట్లును అట్టివియే యగును. గనుక యిటుకట్టవచ్చు అటుకట్టగూడదు అను సందేహము లేదు.

## ఆయదోషము

ఉ॥ ఆలయనిర్మితంబొనర నాతనిజేసిన! నాథుడెవ్వడో ।
యాలయ! యాయమున్గలుగునట్టి! శుభాశుభమందు బాధ్యుడౌ ।
మేలును! గీడు దాననుభవింపగనుండును! దానిబాయన ।
న్యాలయకర్త లౌనరుల కాయపుదోసములంట వెమ్మొయిన్ ॥

తా॥ ఇల్లును మొదట యెవరునిర్మింతురో ఆనిర్మించినయజమానియే ఆయింటికి యేర్పరచబడిన ఆయమునందు గలుగు దోషమును అనుభవింపవలసియుండును. ఆగృహమన్యులకు సంక్రమించిన వారిని యెంతమాత్రము ఆయదోషము బాధింపజాలను.

గృహనిర్మాణ భాగము సమాప్తము.

# గృహ ప్రవేశ భాగము

కం॥ శ్రీశుడు। మానవరక్షా ।
ధీశుడు। దుర్మార్గహారి యిష్టప్రదుడున్ ।
వేశుభదాయకుడగు। పర ॥
మేశుండగు। రామభద్రు నెప్పుడు దలతున్ ।

తా। శ్రీలక్ష్మీనాథుడును ప్రజారక్షణ దీక్షాకంకణుడును దుర్మార్గహరణుడును శుభఫలదాయకుడును పరమేశ్వరుడును యగు శ్రీరామచంద్రుని యెల్లప్పుడు ధ్యానించువాడను.

## గృహప్రవేశ మాసాది శుభాశుభములు

సీ॥ నిలయ ప్రవేశంబు సలుపగా శుభమగు ।
మాఘ ఫాల్గుణ జ్యేష్ట మాధవములు ।
మధ్యమ। ఫలదముల్ మాసమ్ములుం। చైత్ర ।
శ్రావణ కార్తీక సహాములెపుడు ।
అశుభముల్। పుష్యము నాషాఢ భాద్రప !
దంబు, నాశ్వయుజ మాసంబులెపుడు ।
శుభయుతలగ్నంబు శుభదాయకంబగు ।
క్రూరసలగ్నంబు గూర్చు చెరుపు ।

గీ॥ భద్రకరమగు। శకునముల్ప్రభల శుభము ।
దుష్టశకునంబు। లవ్వియు కష్టకరము ।
అవసితమునకు। జేరెడు నధిపునకును ।
మేలుగూర్చెడు విధమున మెలగవలయు ॥

తా॥ మాఘ, ఫాల్గుణ, జ్యేష్ట, వైశాఖమాసములు గృహప్రవేశమునకు శ్రేష్టమైనవి. చైత్ర, కార్తీక, శ్రావణ, మార్గశిర మాసములు మధ్యమమైనవి. ఆషాఢ, పుష్య భాద్రపద,

